## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# జాతిరత్నాలు

[ స్త్రీల పాటలు - కథావైచిత్రి ]



ఇల్లిందల సరస్వతీదేవి

కాపీరైటు]　　1951　　[వెల రు 1-8-0

# విషయసూచిక

# తొలిపలుకు

'జాతిరత్నాలు' అను పేరుతో ఈ పుస్తకములో నిమిడ్చిన కథలు ఐదు. 'ధర్మరాజు జూదము' తప్ప మిగిలిన నాలుగు కథలును పదసహితముగ హైదరాబాదు రేడియో నిలయము నుండి ప్రసారితములైనవి. వానిని కొంతమార్చి, 'ధర్మరాజు జూదము'ను చేర్చి, ఈ రూపమున ప్రచురించినాను.

కథావైచిత్రి పదవైచిత్రియేగాక భారతీయ నాగరికతను సంప్రదాయ సిద్ధములై అనుశ్రుతములైన ఆచారములను కలిగియున్న ఈపాటలు చాలవఱకు వాఙ్మాహాత్మ్యముగ నిలచి యుండుటలో క్రిందు మీదులైనవి. కాలక్రమేణ ముద్రిత రూపమున వెలువడిన వానిలోను ఇదికనుపించుచున్నది. యథాతథముగ పాటలను చదువుటయు కథను గ్రహించుటయు కష్టసాధ్యముగానున్నది. గేయవాఙ్మయములోని కొన్ని మనోహర భాగములను గ్రహించి, చిఱుమార్పులతో కథలలో కూర్చినాను; కథాభాగములో, సాధ్యమైనంత మేరకు పాటలలోని వాతావరణమును తీసికొనిరాఁ బ్రయత్నించినాను.

చాలవఱకు స్త్రీలపాటలలోని ఛందస్సు మంజరీద్విపద మాగిరి కనబడుచుండును. కాని పలుతావుల భగణముమీద లఘువు, అందందు జగణముమీద లఘువు కనుపించుటనుబట్టి చూడగా కర్ణాట చతుష్పద పద్ధతి గోచరించుచున్నది. ప్రతి పాదమునను పంచమాత్రాగణములు మూఁడును, త్రిమాత్రాగణ మొకటియు నుండుట కర్ణాటచతుష్పద సంప్రదాయము. చతుర్మాత్రాగణము లున్నచోట పాడునప్పుడు దీర్ఘము తీయవలసి వచ్చుటకూడ గమనింపఁదగినది.

ఇంక యతిప్రాసల విషయమున ఈగేయకారులు ఎక్కువ పట్టింపుజూపినట్లు కానరాదు. సహజముగా పడిన చోట యతులుపడినవి. కొన్నిచోట్ల హల్సామ్యముమాత్రమే కుదిరినది. కొన్నింట అదియు గమనింపబడలేదు. ఆనోట ఆనోట పడి మార్పులుపొంది యిట్లు యతిభ్రంశములై యుండు నేమో యనుట కవకాశము కొంతగలదు కాని——

ముత్యాలముగ్గులు పెట్టేటివారు
మాణిక్యములదివ్వె పట్టేటివారు
మకరతోరణములు కట్టేటివారు
పచ్చాకు పందిళ్లు వేసేటివారు

ఇట్టి పాదములలో రచనాక్రమమే యిదియైనట్లు గ్రహింపవచ్చును. వ్యర్థపదరహితమగు సరళమైన, సహజమైన శైలిని రచించుటయే వారి లక్ష్యమని తోచుచున్నది. ఈనియమములు పెట్టుకొన్న గ్రంథములలో రచన యెంత మనోహరమైనను, పానకములోని పుడకలవలె వ్యర్థపదములు యతిస్థానముల నడ్డువచ్చుచుండును. దానినిబట్టి చూచిన, ఈ గేయకారుల రసైకదృష్టి సమీచీనమని చెప్పవచ్చును.

పాటలను సవరించుటలోను, గ్రంథరచనములోను పెక్కు సూచనలిచ్చి సహాయము చేసిన పండితకవులు శ్రీ చెలమచెర్ల రంగాచార్యులు గారికిని, శ్రీ శ్రీనివాస సోదరకవులకును కృతజ్ఞతావందనములను సమర్పించు కొనుచున్నాను. ఈ పుస్తకమునకు విపుల పీఠికను వ్రాసి తిలకము దిద్దిన శ్రీ సురవరము ప్రతాపరెడ్డి గారికిని, హైదరాబాదు రేడియో నిలయము వారికిని నేనెంతయు కృతజ్ఞురాలను.

'సుశీలావాడి'-హిమాయతునగరు
హైదరాబాదు (దక్కను)
ఇల్లిందల సరస్వతీదేవి

# పీఠిక

శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవిగారు స్వతంత్ర కథానికలను వ్రాయుటలో నేర్పరులైనారు. తెనుగు కుటుంబాలలోని కొన్ని జీవన ఘట్టముల నేరి పాఠకుల నాకర్షించు విధానమున రచించుచున్నారు. స్వతంత్ర కల్పనలతోపాటు తెనుగు నాటి పల్లెజనులలో - ముఖ్యముగా స్త్రీలలో - నిలిచియుండిన పాటలతోగూడిన కథలనుగూడ తరచిచూస్తున్నారు. అందిప్పుడైదింటి నేరి సొంతమాటలతో కథను నడిపించి రసవంతములని తోచిన భాగములను మూలములనుండి యుదాహరించినారు. మూలములోని పాటలందు యతిగణప్రాస లెగిరిపోయినవి. అందుచేత వీలైనంతవరకు చిరుమార్పులతో వాటిని సరిపెట్టి యుదాహరించినారు. ఈకార్యమునందు వారు మంచినైపుణ్యమును వెల్లడించినారు. ఈ సందర్భమున నీ కథలను గూర్చియు, పాటలవాఙ్మయమును గూర్చియు సంగ్రహముగానైన కొంత తెలుపుట ప్రస్తుతాంశమే యనిపించుకొనును.

స్త్రీలపాటలని ఏలూరు మంజువాణీ ప్రెస్సువారు, రాజమండ్రి కొండపల్లి వీరవెంకయ్య కంపెనీవారు, రాజమండ్రి నూలుసుబ్బారావు కంపెనీవారు, అట్టివారు మరికొందరు కొన్నిపుస్తకములను ప్రకటించినారు. కాని అవన్నియు మోటు కాగిదాలపై అచ్చుతప్పులతో, ఇతరములగు తప్పులకుప్పలతో నసహ్యమగురీతిగా ముద్రింప బడినట్టివి. ఒక్కకథకైనను పీఠికలేదు. ఆ పాటల నెవ్వరు రచించిరో వారు తెలుపలేదు. పాటలలోనైనను వ్రాసినవారి జాడలులేవు. అంతటి

నిస్వార్థు లారచయితలు. ఈ పాటలు, కథలు ఎన్నడుపుట్టెనో ఎచ్చట పుట్టెనో, ఎట్లు ప్రచారమయ్యెనో అవియు తెలియ రావు. ప్రజాసామాన్యమందు నిలిచిపోయిన యీపాటల కథ లను గురించి తెలిసికొనవలెననిన వీటిచరిత్ర, వీటిమూలము, వీటివిశిష్టత మనకు తెలియవచ్చినంతలో కొంతయైనను ఎరిగి యుండవలెను.

మానవప్రకృతిలోనే సంగీత మిమిడియున్నది. ఆనం దము హెచ్చినప్పుడు, శోకాధిక్యము కలిగినప్పుడు, శృంగార విలాసములకు పూనుకొనినపుడు, జనులు సంగీతధోరణిలో పడుదురు. స్త్రీపురుషులు వేడుకసమయములందు, వెన్నెల రాత్రులందు, పండుగలందు గుంపై ఆటపాటలలో నిమగ్ను లగుదురు. కష్టముచేసి సాయంకాల మలసట తీర్చుకొను సమ యములందు ఆటపాటలతో వినోదింతురు. పనులుచేయున ప్పుడు – కలుపుతీయుట, దంచుట, విసురుట, నాటుపెట్టుట, పైరుకోయుట, కళ్లముచేయుటవంటి సమయములలో–పాటలు పాడుచుందురు. దానినే మన తెలుగువారు 'పని – పాట' యందురు.

'సీ. పనిచేసి గంజియైనను అంబలైనను
నెద చల్లగా దాగి యెచటనైన
పడియుండి వెన్నెలగుడిపాట పాడగా
పేదల కాత్మ సంప్రీతి కలుగు"
(భాగం ౨ పుట ౫౯)

అని కొరవి గోపరాజు (౧౪౫౦) తన సింహాసన ద్వాత్రింశికలో చెప్పెను. ఇది ఆంధ్ర కర్షక కార్మిక జనుల ని ప్రాచీనాచారము.

హిందువులు ప్రతివిషయమున కాదిమూలమును వేద లలో కనుగొనుటకు ప్రయత్నింతురు. పాటలకు వేద ుదు ప్రమాణాలను జూపుటకు యత్నింపదలపకున్నను ఒక ాట మాత్రము చెప్పవలెనని బుద్ధిపుట్టుచున్నది. వేదమం ములన్నియు ఉదాత్తానుదాత్త స్వరితయుక్తములైన గాన లే కదా! వాటిని పాడువారిలో ఉద్గాతలు చేరినారు. అద ుడనిండు. మనకు బౌద్ధకాలమునుండి మంచిచారిత్రిక నిదర్శ ు లగపడుచున్నవి. స్త్రీలయున్నతికి, అభ్యుదయమునకు ుసాంఘికసేవాసక్తికి, మాన్యమైన స్వాతంత్ర్యమునకు బౌద్ధ తము చాల దోహదమిచ్చెను. క్రీ. పూ ౫౦౦ నుండి క్రీస్తు ము ౭౦౦ ఏండ్లవరకుండిన మధ్యకాలము అనగా శాలి హన సామ్రాజ్యపతన పర్యంతకాలము భారతదేశములో ్రల స్వర్ణయుగము. అట్టికాలమందు స్త్రీలు కవయిత్రులై స్కృత ప్రాకృత (పాలీ) భాషలందు కవనములను (పాట ుగూడ) అల్లిరి. మిసెస్ రైస్ డేవిడ్సుగారు 'అక్కల టలు' (Psalms of the sisters) అను గ్రంథములో బౌద్ధ ుగమునాటి స్త్రీలపాటలను తమకు లభించినవాటిని సేక రి ప్రకటించినారు.

"ఇదిగో! నేను సానువుపై కూర్చున్నాను. నాయా త్మపై స్వాతంత్ర్యవాయువు వీస్తున్నది" అని యొక తెయు;

"ఇంటిని వదలినాను, నాచిన్న ప్రపంచాన్ని వదలినాను. నాశిశువును వదలితిని. నాదంతయు వదలితిని. ఆశలు, అవిద్య, నన్నువదలినవి" అని మరొక తెయు,

"ఓహో! నేనుస్వేచ్ఛను పొందినాను. ఆస్వేచ్ఛనాకు మూడు వంకలనుండి కలిగినది. తిరుగలి, రోలు, గూని మగడు—ఈమూటినుండి విముక్తి కలిగినది. నాకుజీవన్ముక్తి యుకలుగుతుంది" అనిగూనిమగని సంసారబాధలనుండి తప్పించుకొని బౌద్ధభిక్షుణియైన మరొక తెయు,

స్వేచ్ఛాగానములు చేసిరి. హాలుని గాథాసప్తశతిలో ఇంచుమించు పదుగురు స్త్రీల 'గాథలు' సంకలితములైనవి.

వాల్మీకి రామాయణము మొదట గానరూపముగా నేటి మన'తందానకథ' వంటిదిగా నుండెను. ఇప్పుడు మనము చదువు రామాయణమును తర్వాతిభక్తులు పెంచుతూ పెంచుతూ రూపరేఖలిచ్చుచు రంగులిచ్చుచు వచ్చినారు. రామాయణమును గానముచేసినవారు కుశలవులు అనగా కుశీలవులు అనగా పాటపాడి కథచెప్పువారు. వారు రామాయణమును 'అగాయతాం మార్గవిధాన సంపదా' మార్గవిధానముతో పాడిరట! 'మార్గ దేశివిభాగేన సంగీతం ద్వివిధం మతం' అని సంగీతశాస్త్ర మంటున్నది. కాళిదాసు రెండుమూడు తావులందు తన కృతులలోపల పల్లెజల పాటలనుగురించి సూచించెను.

"ఇక్షుచ్ఛాయ నిషాదిన్య స్తస్య గోప్తు ర్గుణోదయం
ఆకుమార కథోద్ఘాతం శాలిగోప్యో జగు ర్యశః"
(రఘువంశము ౪ - ౨౦

వరిచేలను కాయు పడుచులు ప్రక్కనుండిన చెరకు చేలలో గడలనీడలలో కూర్చుని రఘుమహారాజు చరిత్రను పాటకట్టి పాడుకొని కాలము గడిపిరట! చెరకుగడలలోని తీపి యాయువతుల కంఠస్వరములోనికి, గానములోనికి, వాటిలోని భావములోనికి నెక్కియుండును. ఆ పాటల పసందుచేసి చెరకుతోట యంతయు మాటి మాటికి తలయూపియుండును!!

"శస్త్రై రుత్సవ సంకేతాన్ సకృత్వా విరతోత్సవాన్
జయోదాహరణం బాహ్వోర్గాపయామాస కిన్నరాన్"
(రఘువంశము ౪ - ౭౮)

ఉత్సవగణము అనునొక గణరాజ్యమును (రిపబ్లిక్) రఘుమహారాజు జయించిన తర్వాత కిన్నరులు (హిందూస్థానము టిబెట్‌తో కలియు ప్రాంతపువారు) ఆతని 'జయోదాహరణమును' గానముచేసిరి. (కళికోత్కళికాది సప్తవిధ త్వాత్మక గానసమాయుక్త గీతికలను ఉదాహరణములందురు.) సంస్కృత వాఙ్మయములో ననేక విధములగు పాటలుండె నని రత్నావళీ నాటకమందును, మరికొన్ని నాటకములందును నిరూపింపబడినది. గీతగోవిందము వంటివి గీతికా కావ్యములు. ఇదంతయు చాలప్రాతకాలమునాటి ముచ్చట.

స్కాట్లెండ్ దేశీయుడగు ఆండ్రూఫ్లెచ్చర్ అనువాడు క్రీ. శ 1703లో నిట్లనెను. "ప్రతి జాతియొక్క జానపదములు (Folk Songs) ఆజాతియొక్క శాసనములకన్న మిన్నయైనట్టివి" యూరోపు దేశములో పల్లెపాటల ప్రాముఖ్యమును ౨౦౦ ఏండ్ల క్రిందట గుర్తించిరి. మనవారు ౨౫౦౦ ఏండ్ల క్రిందటనే

గుర్తించి యుండిరి. కాని ౧౦౦౦ ఏండ్లు మనవారు వాటిని నిరాదరించి ఇంగ్లీషు వాఙ్మయ ప్రభావముచే మరల వాటి నుద్ధరించుటకు ప్రారంభించినారు. ఇతర భారతీయ సోదరవర్గ ముల వారెంత కృషిచేసినారో తెలుసుకొనిన తర్వాత మన తెనుగు పాటలను గురించి తెలిసి కొందము.

శ్రీ దేవేంద్ర సత్యార్థిగారు అను పంజాబీ సారస్వతో పాసకులు హిందూస్థానమందలి యన్ని ప్రాంతములు తిరిగి యచ్చటి జానపదగీతములను గురించిన విశేషములను సేకరించి ప్రకటించిరి. ఒకమారు 'రూరల్ ఇండియా' అను నింగ్లీషు మాసపత్రికలో (జనవరి ౧౯౪౦లో) 'భారతదేశపు పల్లె పాటలే జాతీయవాఙ్మయము' అను నొక యమూల్యవ్యాస మును రచించిరి. అందలి ముఖ్యవిషయము లిందుదాహరి స్తున్నాను.

"పంజాబులో నూర్లకొలది గొల్లలు మంచిమంచి భావ యుక్తమైన పాటలు పాడుచున్నారు.

"గోండులను అడవిజాతిలో మంచిసుందరగానాలు కలవు.

"ఆంధ్ర దేశమందు పల్లెపడుచులు ప్రత్తివిరుచునప్పుడు ముద్దుపాటల పాడుదురు.

"పఠాన్ స్త్రీలు శతాబ్దముల తరబడి అందమైన పాటలు పాడుకొనుచు వచ్చినారు.

"క్రీ. శ ౧౮౭౧లో గోవర్ అను యూరోపియన్ దక్షిణ ఇండియా పల్లెపాటలు (Folk Songs of Southern

India) అను గ్రంథమును ముద్రించిరి. ఈ వాఙ్మయమును తెలుపు మొదటి గ్రంథ మిదియే!

"౧౮౮౪లో ఆర్. సి. టెంపిల్ పంజాబీ లిజెండ్సు అనుదానిని ప్రకటించెను.

"చంద్రకుమార దేవ్ తూర్పుబంగాళీ గేయములను ప్రకటించెను. దీనినే ఇటీవల రోమారోలాసోదరి ఫ్రెంచి భాషలో ననువదించి ప్రకటించెను. కే. యం. మున్షి గుజరాతీ పాటల సేకరించి ప్రకటించెను. ఆ గ్రంథానికి మహాత్మాగాంధీ పీఠిక వ్రాసెను. రామనరేశ్ త్రిపాఠీ 'గ్రామ గీతములు' అను గ్రంథమును హిందీలో ప్రకటించెను. వాటిని సేకరించుటలో అతడు పడిన పాట్లులు ఆతని పెరుమాళ్ళ కెరుక. స్త్రీలు వరిపొలాలలో కలుపుతీయుచు పాడినప్పుడ దేపనిగా వరాలపై కూర్చుని లేక పొంచియుండి వ్రాసుకొనెను. కొన్ని గ్రామాలలో నతడు ప్రభుత్వచారుడని జనలు భయముతో వైదొలగిపోయిరి. మరికొన్ని తావులలో నతడు జైలునుండి తప్పించుకొని పారివచ్చిన దొంగయని వ్రేల్జూపుచు వచ్చిరి. ఎన్నైతేనేమి, ఎవ్వరేమన్న నాకేమికొదువ యని యతడు సాధించి హిందీలో 'కవితా కౌముది' అను అయిదు పెద్ద సంపుటాలను గూడ సమకూర్చి ప్రకటించెను.

"పండిత రామశరణదాసు మరియు సంత్ రాం అనువారలు ఉర్దూలో 'పంజాబ్ కీ గీత్' ప్రకటించిరి.

"రాజస్థాన్‌కీ గీత్' అను మరొక గ్రంథము ముద్రితమైనది.

"మదన్‌లాల్ నిహాల్‌చంద్, ఛేటూరాంఝూలి, తారాచంద్ ఓర్ఝూ అనువారలు వేర్వేరుగా మార్వాడీ గీతములను ప్రకటించిరి.

"వెరియర్ ఎల్విన్ అను ఇంగ్లీషుఫాద్రీ ౨౫౦ గోండు పాటలను సేకరించి అరణ్యకగీతములు (Songs of the forest) పేరుతో ఇంగ్లీషులో ప్రకటించిరి.

"వామణ కృష్ణచోర్‌ఘూరే మరాటీపల్లెపదాలుకూర్చి 'సాహిత్యాచే మూలధన్' అను పేర ప్రకటించెను.

"కర్ణాటకులును గ్రామగీతములను కూర్చిప్రకటించినారు."

ఇక మిగిలిన వారము మనమే.

మన పొరుగున నున్న యాటవికులు మన తెనుగువారు. చెంచులు, గోండులు, కోయలు తెనుగు మాట్లాడుదురు. వారిలోను పాటలు కలవు. మనపాటలనే మనము పూర్తిగా కూర్చి సంస్కరించి మంచి పీఠికలతో సుందరముగా నచ్చు వేసినవారము కానప్పుడు మన యాటవికుల నడుగబోయిన వారమా? కాని జర్మనీనుండి వచ్చిన హేమన్ డ్రాఫ్ చెంచులను గురించి, గోదావరీ ప్రాంతపు పాపికొండలలోనిదగు బిసన్ కొండలోని రెడ్డి బిరుదమును లాగుకొని పెట్టుకొన్నయాటవికులను గురించి యుద్గ్రంథములను వ్రాసిరి. అందు వారి పాటలను, వారి కథలను, వారి యాటలను వెల్లడించిరి. ఇంగ్లీషు వాడైన గ్రిగ్సన్ గోండులను గురించి వ్రాసెను.

౧౯౪౦ ఏప్రెలు నెల మాడరన్ రెవ్యూలో దేవేంద్ర సత్యార్థిగారు 'ఊర్మిళాదేవి నిద్ర' అను తెనుగుపాటను ఇంగ్లీషులోని కనువదించి దానిపై అయిదుపుటల పెద్దవ్యాసమును ప్రకటించిరి. ఒక పంజాబ్ పండితుడు బెంగాలులోని పత్రికలో ఇంగ్లీషుభాషలో తెనుగుపాటను గూర్చి వ్రాసెను. నేనా కథను తెనుగులో చూచియుండలేదు. వెంటనే 'గుజరీ' నుండి ఒక అణాకు తెప్పించి చదివితిని.

"శ్రీరామ భూపాలుడూ-పట్టాభి
షేకుడై కొలువుండగా"

అని ప్రారంభము కలదది. అంతయు తప్పులకుప్ప! కాని భావములును వాటినడకయు సుందరముగా నున్నవి. ఆ పాటపై శ్రీమతి సరస్వతీదేవిగారి దృష్టియు పడి యీకూర్పులో చేరుట చాలముదావహము.

ఇక తెనుగు దేశములోని పాటలను గురించి కొంత తెలుపవలెను. నన్నయకు పూర్వము తెనుగులో పాటల కవిత విశేషముగా నుండెను. నన్నయ భారతముతో వాటికి నిరాదణ కలిగెను. ద్విపదలోనే ఎక్కువగా పాటలుండెడివి. రగడలు, అక్కరలు, మంజరులు కూడా పాటలకు వాడిరి. బౌద్ధులు తమ మత వ్యాప్తికి సులభ జనభాషను వాడినట్లుగా శివకవులు ద్విపదలో శైవమత ప్రచారము చేసిరి.

"ఉరుతర గద్యపద్యోక్తుల కంటె
సరసమై బరగిన జాను తెనుంగు

చర్చింపగా సర్వసామాన్య మగుట
కూర్చెద ద్విపదలు కోర్కెదైవార"

అని పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్రయందు వ్రాసెను. పాల్కురికి తన కాలమందును (అనగా క్రీ. శ ౧౨౮౦-౧౩౦౦) నంతకు పూర్వమందును నుండిన పద వాఙ్మయమును గూర్చి వివరముగా తన గ్రంథాలలో నిట్లు తెలిపెను.

"మది నుబ్బి సంసారమాయాస్తవంబు
పదములు, తుమ్మెద పదముల్, ప్రభాత
పదములు, పర్వత పదము, లానంద
పదములు, శంకర పదముల్, నివాళి
పదములు, వాలేశు పదములు, గొబ్బి
పదములు, వెన్నెల పదములు, సెజ్జ
వర్ణన, మరి గణవర్ణన పదము
లర్ణవ ఘోషణ ఘూర్ణిల్లు చుండ
బాడుచు నాడుచు పరమహర్షమున"

ఇందు కొన్ని పాటలు నేటికిని నిలిచినవి. ఈపట్టిక ఇంతటితో పూర్తికాలేదు. తందాన కథలన్నియు పాటలే! వీరరసమునకొకధాటితో, శోకరసమున కొకరాగముతో, హాస్యమున కొకవిధముతో-తందాన కథలు సాగును. అందు ప్రధానము వీరరసము. ఇంచుమించు ౫౦ తందాన కథలు ముద్రణలేక మునిగిపోతున్నవి. ఉద్ధరించు నాథుడులేడు. పల్నాటివీరుల

కథలన్నియు ద్విపదలోనేయున్నవి. అవి నేటికిని పల్నాటిలో మహాోద్రేకముగా వీరాభినయముతో చెప్పుదురని విందుము.

తమ నిత్యజీవనములో జనులు నానావిధములగు పాటలతో కాలముగడుపుట చూచుచున్నాము. అందు కొన్ని:

౧. ఏలపాటలు–మోటకొట్టునప్పుడు పాడునవి.

౨. ఉయ్యాలపాటలు–చిన్నకథలను చెప్పుచు కూలిజనులు పాడుకొందురు.

"మముగన్న మాతండ్రి–ఉయ్యాలో
నీ వెక్క డున్నావో–ఉయ్యాలో"

అను ధాటిలో నవి సాగును. ఇవి ద్విపదలే!

3. పెండ్లిపాటలు—అందు ధవళాలు, సువ్వాలు చేరినవి. అప్పకవి ఛందోభాగములో లాలి, పెండ్లిపాట, శ్రీధవళము, సువ్వాలెసువ్వి, యక్షగానము అను పాటలకు ఛందస్సులను తెలిపినాడు. ధవళాలు, సువ్వాలు, లాలి, పెండ్లిపాట- ఇవన్నియు నిన్నటివరకు ప్రచారములో నుండెను. ఇప్పుడు మోటుసరసపు ప్లేటుపాటలు పాడుచున్నారు. అందచందములులేనివవి!

౪. దసరాపాటలు – 'మహార్నవమి' మనపల్లెలలో చాలా గొప్ప పండుగ.

"శ్రీగణాధీశాయ శివకుమారాయ
నాగాస్య తుండాయ నాగభూషాయ"

అన్నధాటి ద్విపదకాక మరేమి?

౫. మేలుకొలుపులు-పూర్వము మాచిన్నతనము వరకును పల్లెలలో వీధిబళ్లలో చీకటిలోనే బడి ప్రారంభమయ్యెడిది. అప్పుడు భూపాళరాగములో బడిపిల్లలు

> "తెల్లవారెను తూర్పుదిక్కున
> అల్లనల్లన వికసె కమలము
> తెరలెతిమరము గృహమువిడిచియు
> అయ్యో రావయ్యా-
> కృష్ణా! మేలుకోరా!"

అని పాడుచుండెడివారు.

౬. తత్త్వము–తత్త్వబోధకులు నానావిధములగుపాటలు పాడిరి.

౭. రాటముపాటలు – అవి విశేషముగా ద్విపదలే!

> 'సీ. ప్రియుంపుపడుచులా పనిగొంటివే దూది
> యనెడి తేనియపాట చినుకు లీన"

అని కదరీపతి రాటమువడుకు స్త్రీలపాటలను వర్ణిస్తూ సీసపద్యములో ద్విపదపాదము నిరికించెను.

౮. కోలన్నపాటలు–

> "శ్రీరాముల చూచేదెన్నటికో
> శ్రీరాముల-చూచే......"

అను భక్తిగానములనో–

> "నాసామి నామీద వలచినాడమ్మా
> ఇంటికి రమ్మన్న రాడేమి కొమ్మా"

అని రసిక ప్రలాపములనో–

"భల్లా భల్లున తెల్లావారె
లెయ్యావయ్యా మియ్యాసాయెబూ!"

అని వీరుల గురించియో పాడుచు అందెలు వేయుచు కోలన్న వేయుచుందురు. ఉత్సవాలలో వెన్నెల రాత్రులలో నీ వినోదము లుండెడివి.

"ఏమోయి చిన్నారి చెలికాడ! నీవైతే నిన్నాడ కోలన్న
యేస్తుండగా చూసినాల్నుండినాకిట్లె రాతాపమంటెంది"

(ఇరా=విరహ) అని యొక దాసరిబోగముది నేస్తగానితో ముచ్చటించెనని ౨౫౦ ఏండ్ల క్రిందట కర్నూలు కవియగు గండ్లూరి నరసింహకవి తన భాషీయదండక మందు వ్రాసెను.

౯. తోలుబొమ్మలపాటలు–ఇవిపాల్కురికికంటెముందుండెను. అతడు వాటిని వర్ణించెను. నేడు క్వాచిత్కముగాతోలు బొమ్మలాటలు కనబడిన వాటి నాడించువారు మరాటీలు. వారు నేటికిని రామాయణ కథ నాడించునపుడు గోన బుద్ధని రామాయణములోని ద్విపదలనే పాడుదురు.

౧౦. జావళీలు — శృంగార భూయిష్టమైనవి. క్షేత్రయ్య, సారంగపాణి, ముద్దుపళని, తంజావూరు కవులు వీటి నెక్కువగా రచించిరి.

౧౧. పిల్లల పాటలు—

౧౨. స్త్రీల పాటలు–కామేశ్వరి పాటలు, వేడుకలపాటలు, అధ్యాత్మ రామాయణాది కీర్తనలు మున్నగునవి.

ఇంకను కొన్ని విధములగు పాటలు-అవి వివిధములనవచ్చును.

"బేటాయిసామి దేవుడా
కదిరీ నరసింహ రాయడా
కాటామ రాయుడా
నన్నేలీనవాడ—బేట్రాయి"

అని యొక భక్తుడు;

"బండిరా పొగ బండిరా దొర
లెక్కే రైలూ బండిరా
వంగి దండం పెట్టవరకు
మంగ పట్నం చేరెరా—
బండిరా పొగ బండిరా—దొర
లుండె రయిలూ బండిరా.
మండలంబున గంగదాసను
దండి కవి యిది చేసెరా.
.....................
ముందు వెనుకను నడచురా
ముజ్జగంబుల బోవురా."

అని యొక పల్లెటూరివాడు;

"ధీరుడా జమదారుడా
మల్లెన్న దొస్తవు నాయడా"

అని యొక బండివాడు పాడిన పాటల వంటివి, పెరుమాళ్ల చిన్నని పాటలవంటివి దేశమంతటను నిండియున్నవి.

పిల్లల పాటలను గురించి కొంత ప్రత్యేకముగా చెప్ప వలెను. శ్రీ చింతా దీక్షితులుగారు కొన్ని పిల్లల పాటలను

సమకూర్చి ప్రకటించినారు. కాళ్లకూరి గోపాలరావుగారు పది పండ్రెండు పిల్లల పాటలను Nursery Rhymes అని యింగ్లీషు పేరుపెట్టి ప్రకటించి యుండిరి. భారతిలో కొన్ని సంవత్సరాలు పిల్లలపాటలు ప్రకటించి తర్వాత మానుకొనిరి. పిల్లల పాటలకు గూడ రచయిత లుండియుందురు. ఆ నిష్కామకర్ము లెవ్వరో యేమో! వారి పాటలు పిల్లల లోకములోనెట్లు వ్యాప్తిగాంచెనో యేమో! పిల్లల పాటలు అర్థములేనియతిప్రాసల పదముల కూర్పని తలంపరాదు. కొన్నింటిలో గొప్పయర్థ మిమిడినది. కొన్ని పాటలనేరి వాటిలో ఆయుర్వేదపు గొప్ప చిట్కాలిమిడియున్నవని మొదటిసారి పరిశోధించి వెల్లడించినవారు శ్రీ వేదాల తిరుమల రామానుజస్వామిగారు. 'చెమ్మచెక్క చేరడేసి బొక్క'; 'కొంగరాజు కొండనెక్కె...కాలువిరిగె, దానికేమి మందు, నూనెమ్మబొడ్డు-నూటొక్క ధార' వంటియనేక పిల్లలపాటలను వారువైద్యశాస్త్రముతో సమన్వయించి నిరూపించినారు.

మన వాఙ్మయములో పల్లెపాటలనుగురించి పాల్కురికి సోమనాథుని మొదలుకొని అయ్యలరాజు నారాయణామాత్యునికి వరకు పలువురు పలుమారు వర్ణించినారు. అందు ముఖ్యులు శ్రీనాథుడు (క్రీడాభిరామములో - చాటువులలో), తాళ్లపాకవారు, కదిరీపతి, కొరవి గోపరాజు, వేంకటనాథుడు, అయ్యలరాజు నారాయణామాత్యుడు. క్రీడాభిరామములో నీ క్రిందిపద్యా లానాటిజానపద గీతములనుగురించి వెల్లడించును.

"ఉ. కోయిల పంచమస్వరము క్రోల్చినభంగినివిద్ది కూచిరా
మాయణ మారుకొండములు నచ్యుత జాగర వేళ బాడెనా

రాయ వితంతురత్న మనురాగముతోడ నమశ్శివాయ, శాం
తాయ, సమస్త దోషహరణాయ, సమానమె దానికెవ్వరున్.

గీ. రాగముననుండి లంఘించు రాగమునకు
నురుమ యూరు ద్వయంబుపై నొత్తగిల్ల
కామవల్లీ మహాలక్ష్మి కైటభారి
వలపు పాడుచువచ్చె జక్కుల పురంధ్రి.

(ఇది కామేశ్వరి కథ)

గీ. వాద్యవైఖరి కడు నెరవాది యనగ
నేకవీరా మహాదేవి యెదుట నిల్చి
పరశురాముని కథలెల్ల ప్రౌఢి బాడె
చారుతరకీర్తి బవనీల చక్రవర్తి"

ఏకవీరయె యెల్లమ్మ; ఎల్లమ్మయే పరశురాముని తల్లి. నేటికిని ఎల్లమ్మదేవర చేయునాడు బయనివాడు (బవనీడు) జమిడిక (జవనిక) మ్రోయించుచు ఎల్లమ్మ యొక్కయు, పరశురాముని యొక్కయు కథనుపాడి చెప్పుచుండుట పల్లె జను లెరుగుదురు.

మ. ద్రుతతాళంబున వీరగుంభితకథుం థుం థుం కిటాత్కారసం
గతి వాయించుచు నాంతరాళిక యతిగ్రామాభిరామంబుగా
యతిగూడన్ ద్విపద ప్రబంధమున వీరానీకముంబాడె నొ
క్కతె ప్రత్యేకముగా గుమారకులు ఛీట్కారంబునందూలగన్.

(ఇది పల్నాటి వీరుల ద్విపద గానమును గూర్చిన ముచ్చట)

ధవళాదులను గూర్చి కదిరీపతి వ్రాసిన పద్యాలలో నీ క్రింది దొకటి :

“ఆలలనామణి కాగ
య్యాళి యొకానొక్కవేళ సక్కరతోసు
వ్వాలున్, శోభనములు, ధవ
ళాలున్ మొదలైన పాటలం దగ నేర్పున్”

ఇట్టి నిదర్శనములు మరికొన్ని ప్రాచీన కవుల వర్ణనలందు కలవు.

ఇక ప్రకృతమునకు వత్తము. ఈ సంపుటిలో అయిదు కథలు కలవు. అందు లక్ష్మణదేవరనవ్వు, ఊర్మిళాదేవినిద్ర రామాయణ సంబంధమైనవి. సత్యాభామా సరసము భాగవత సంబంధము. ధర్మరాజు జూదము మహాభారత సంబంధము. ధర్మాంగద చరిత్ర ఏ పురాణమందైన కలదో లేదో? పతివ్రతల విధులను, స్థలమాహాత్మ్యములను వర్ణించు కథలను పౌరాణికులు చాలా యల్లిరి. అందీ విచిత్రకథయొకటి.

లక్ష్మణదేవరనవ్వునకు, ఊర్మిళాదేవి నిద్రకు వాల్మీకి రామాయణములోనా ధారమేమియులేదు. వాల్మీకి రామాయణమునే ఇంచుమించు సగభాగము పెంచినారని నాఅభిప్రాయము. ఇప్పటి వాల్మీకి రామాయణమునకు భిన్నముగా కథాఘట్టములు తెలుగు దేశమందేకాక యావద్భారత దేశభాషలందును, జైనబౌద్ధులచే రచితములైన రామాయణములందును ననేకములు కలవు. తుదకు జావా మున్నగు ఇండోనీషియా దీవులలోను రామకథ భిన్నించి కథలుగా,

పాటలుగా, ఆటలుగా వ్యాప్తిలోనున్నది. సంస్కృత మహాభారతములోని రామకథలో వాల్మీకి రామాయణమందు లేని యొంటికొమ్ము ఋశ్యశృంగుని నెత్తిపై మొలిచెను. తెనుగులో గోనబుద్ధుని రంగనాథ రామాయణమే మొట్టమొదటిది. అందు మరికొన్ని కథలు పెరిగివచ్చెను. ఆరామాయణమునకు పాఠభేదాలేర్పడెను. నావద్దనుండిన తాళపత్ర ప్రతిని ఆంధ్ర విద్యాపీఠమునకు శ్రీ సీ. ఆర్. రెడ్డిగారు తీసికొనివెళ్లి దానిలోని విశేషపాఠముల ననుబంధమందు ముద్రింపచేసిరి. అందు లక్ష్మణదేవర నవ్వుకథ కలదు. ఆ కథను స్త్రీలపాటలనుండి గ్రహించి రంగనాథ రామాయణమునకు విశేషపాఠముగా తర్వాత నెవ్వరో చేర్చిరని తలతును. విశేషపాఠములుకల నా ప్రతి కర్నూలు అలంపూరు కలియు ప్రాంతములోనిది. కావున నీ కథ కచ్చుట కాళ్లువచ్చెననుకొందును.

'ఊర్మిళాదేవినిద్ర' సుందరముగా నున్నది. లక్ష్మణునకు పెండ్లియైయుండెనా అన్నదే నాకుసందేహము! ఆచర్చను రామాయణ విశేషములందు చేసియుంటినికాన నావివరణములిచ్చుట యవసరముండదు.

'సత్యభామా సరసము' మన తెనుగు కవులకు, యక్షగానాల రచయితలకు ప్రియమైన ఘట్టము. కూచిపూడి భాగవతులు తమ యభినయాది శక్తులనంతయు 'భామాకలాపము' లోనే చూపుట రసికులెరిగిన విషయమే. సవతులకథలే జనరంజకమని యక్షగానాల రచయితలు తలచి యట్టివే విశేషముగా రచించిరి. రథోత్సవములలో 'పారువేట పాటలు'

పాడుదురు. కృష్ణుడు రాత్రిపొద్దుపోయి అష్టభార్యలలో నొకతె యింటికి వెళ్లగా కన్నులు కాయలు కాచునట్లుగా నిద్ర కాచికాచి మగనికై వేచివేచి తుదకువిసివి కోపముతో మూతి బిగించుకొని తలుపు బంధించుకొనియున్న నాయికను కృష్ణుడు ప్రార్థించుట, నాయికతలుపుసందులనుండిచూచి యేమోకృష్ణుని పైగల పేరిమముద్రలను, చిహ్నములనుగూర్చి ప్రశ్నించుట, యతడు పలుబొంకులు బొంకి తననిర్దోషిత్వమును సమర్థించు కొనజూచుట, తుద కిరువురికి సమాధానము కుదురుట విను చుందుము. ఈ సత్యభామాసరసములో నట్టి సరసమే కలదు.

'ధర్మరాజుజూదము' లోని కథలో నిచ్చట ద్రౌపది దుర్యోధనునితో జూదమాడి గెలిచిన వర్ణనము కలదు. దానికి సంస్కృతమం దాధారములేదు. తెనుగునను లేదుకాని వావిళ్ల వారి ముద్రిణలో అధికపాఠమని యట్టి కథాభాగమును జూపించి, 'అది సందర్భశుద్ధి లేనట్టిది' అని వారేయన్నారు. అదేసరి. రంగనాథ రామాయణములోనికి లక్ష్మణదేవరనవ్వు ఎక్కినట్టుగా భారతములోని కెవ్వరో యభిమానులు ద్రౌపదీ ద్యూతము నెక్కించినారు.

ఈ ద్రోవద్ధి జూదములోని కొన్నిఘట్టము లతి సుందరములు. తన పాండవులతో దుర్యోధను డేపాటియు సాటిగాడని యిట్లనెను:

"రహి గాజు మెరసితే రత్నమేయగునా
మణి నల్లపైనంత మసిబొగ్గ యగునా
కాలువ లెన్నైన గంగకు సాటె

చిరుపాము పడగెత్త శేషుడే యగునొ
వృక్షమ్ము లెక్కిన పక్షులన్నియును
ఇల గరుత్మంతున కీడౌనెయెందు?''

ఇది మధురమైన సుందర కవిత. ఈకథలో తెనుగువారి లోని కొన్ని యాచార విశ్వాసములు తెలిపినారు. ఇవి నేటికిని ఇంటింట పాటింపబడునట్టివి. ఏ కారణములచే దరిద్రమావరించు కొనునో, ఏ కారణములచే లక్ష్మి యిండ్లలో నెలకొనునో వర్ణించు భాగములను చూచిన యీవిషయము స్పష్టమగును.

ఈ అయిదు పాటల కథలకు శ్రీమతి సరస్వతీదేవిగారు 'జాతిరత్నాలు' అని పేరుపెట్టినారు. ఇంత పెద్దపీఠిక వ్రాసినదొక ఎత్తు: ఒకే ముచ్చటయైన ముద్దుపేరులో తాను చెప్పదలచిన దంతయు తెలుపుట యొక యెత్తు! కావున అలమతి విస్తరేణ!!

అనేక జాతిరత్నాలను ఈ సరస్వతీదేవిగారిటులే సేకరించి ప్రకటింతురుగాక! పాఠకు లాదరముతో వాటిని తలదాల్తురుగాక!

సెప్టెంబర్ ౧౯౫౧-　　　　సురవరము ప్రతాపరెడ్డి

# జాతిరత్నాలు

## 1. లక్ష్మణ దేవర నవ్వు

రఘువంశ సంజాతుఁడైన శ్రీరామచంద్రుఁడు పితృ వాక్య పరిపాలనకై పదునాలుగేండ్లు వనములో నివసించి అనేక దుష్టరాక్షసులను సంహరించి తాపసులకు శాంతియుత మైన జీవిత మొసంగెను. వానరసేనా సమేతుఁడై రాక్షస రాజును బరిమార్చి, లంకారాజ్యమునకు విభీషణుని రాజుగాఁ జేసి, సీతాలక్ష్మణ సహితుఁడై అయోధ్యానగరము ప్రవే శించినాఁడు. ప్రజల కోరిక మీఁదను, భరతునికి చేసిన వాగ్దానము వలనను రాజ్యమును తిరిగి స్వీకరించి, ప్రజాను రంజకముగా రాజ్యమేలసాగినాఁడు.

అనేక కష్టములను, దుఃఖములను అనుభవించిన తరు వాత ప్రాప్తించిన సుఖానుభూతి ఎంత ఆనందకరమైనది!

ఒక నిండు పున్నమనాఁటి పండువెన్నెలలో, శ్రీరామ చంద్రుఁడు బంధుమిత్ర పరిజన సమేతుడై కొలువు తీరియున్న సమయములో—

వెన్నెల బైలనే వేల సంఖ్యలను
గద్దెలు బెట్టించి కరుణాకరులు
అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకులు
కోసలేశ్వరులంత కొలువు గూర్చుండిరి.
విభీషణుడును పెక్కు వీణెములు తెచ్చి
ఆ రాఘవేశ్వరుల హస్తానునుంచె.

వీడెములు దెచ్చియు విప్రులకు నెల్ల
వరుస దయచేసిరి వాలి మర్దనులు.
వాలి మర్దనులచె వామ భాగమున
వానరుల చెంత నట వసియించి కొలువ
వస్త్రాంబరంబులు వరభూషణములు
విస్తారముగ దెచ్చి విభీషణు కిడిరి.
వరుస నందలములు తురగములు పసిడి
ధరణిపతి దివాకర తనయునకు నిచ్చె.
సింహాసనము చెంత జేరి యిరుగడల
పనులేమి యనుచును వరభక్తితోడ
వారలిరువురును తమ పరివారములతొ
మ్రొక్కి ముందుగ నిల్చి ముదముతో గొలువ;
సింహ విక్రముడైన శ్రీరామచంద్రు
పాదమ్ము లొత్తుచును వరము లడుగుచును
మారుతసుతుడు హనుమంతుండు గొలువ
నున్నంత కొలువులో నురవుమై నుండె.

ఆ శుభలగ్నమున-వజ్రదళమూర్తి యయిన రఘురాముని కొలువులో, భ్రాతృశుశ్రూషలో నిమగ్నుఁడైనలక్ష్మణదేవరకు పక్కన నవ్వు వచ్చెను. పలువురు పెద్దలు కూడిన ఆ రాముని పదసన్నిధిలో—లక్ష్మణుని నిర్హేతుక మయిన నవ్వు సభ్యులకందఱకును ఎన్నియోవిధముల అపోహ కవకాశ మిచ్చినది. 'లక్ష్మణస్వామి నన్నేచూచి నవ్వినాఁడేమో'అని ఎవరికి వారు తమతమ మానసములను కలఁతపఱచుకొన్నారు.

సభ్యులలో సామాన్యు లెవరును లేరు. కొలువు తీరినది జగన్నాయకులు-కొలువు నలంకరించినది శ్రీరామానుచరులును త్రిలోకాధి పతులును. అప్పుడా సభలో—

కలకల నవ్వె లక్ష్మణదేవ రపుడు
కిలకిల నగ, రాజు ఖిన్నుడైపోయె.
ఇందరి చిత్తమ్ము లీవిధమ్మునను
కలత నొందగ గొల్వు కడు చిన్నబోయె.
తనలోన శశిమౌళి తలపోసెనిట్లు
జాలరివీధుల నీలకన్యకను
జడలెత్తి శిరసున ముడిచికొంటినని
తలచి లక్ష్మణమూర్తి తానవ్వె ననుచు
కొలువులో శంకరుడు తలవంచుకొనెను.
జాంబవంతుడు తలచె స్వాంతమం దిట్లు
ఈశ్వరుని పెండ్లికి ఈ జగమ్మంత
పిలువ నంపిరి నన్ను ప్రేమ తోడుతను
గునగున నడువగా కురుచజంఘలను

* * * * *

వనిపూని నడువగా పదము లోపలను
సగము విరిగిన యట్టి సంగతుల్ దెలిసి
తలచి లక్ష్మన నేడు తానవ్వె ననుచు
తగ జాంబవంతుండు తలవంచుకొనెను.
తనలోన శేషుండు తలపోసెనిట్లు
సర్వకాలము రాజు శయ్యగానుండి
పగవానికా వీడు భక్తుడాయెనని
తలచి లక్ష్మన నేడు తానవ్వె ననుచు
కొలువులో శేషుండు తలవంచు కొనియె.

* * * * *

* * * * *

తన యన్న వాలిని ధరణిపతి దాగి
చంపగా వదినెను సతిని జేసికొని
కిష్కింధ నేలుచు క్రిందు మీదులను
కానకే యున్నాడు కపినాథు డనుచు
తలచి లక్ష్మన నేడు తానవ్వె ననుచు
సుగ్రీవు డంతట సొక్కి తలవంచె.
తనలో విభీషణుడు తలపోసె నిట్లు
అయువులు దెల్పియు నుపాయ మమరించి
అక్షౌహిణీ బలము లందరిని జంపి
లంకకు పట్టంపు రాజైతి ననుచు
తలచి లక్ష్మన నేడు తానవ్వె ననుచు
కొలువున విభీషణుడు తలవంచుకొనెను.
తనలోన హనుమయు తలపోసె నిట్లు
పెద్దవాడనె కాని పేరుకే పెద్ద
పడుచువాని చేతను వట్టుపడితినని
తలచి లక్ష్మన నేడు తానవ్వె ననుచు
అంజనీ సుతుడైన హనుమ తలవాల్చె.
భరత శత్రుఘ్నులు భయమంది రంత
ధరయెల్ల గైకొని తమతల్లి కైక
అంపినది యుగ్రంపు టడవులకు నింక
ఇమ్మహిని వచ్చునే ఈ మహీపతని
ఇష్ట సంపదలతో నిట్లున్నవారు
అనుచు లక్ష్మణమూర్తి గని నవ్వె ననుచు
తలచుకొని యిద్దరును తలవాల్చిరపుడు.
ధాత్రిసుత తనలోన తలపోసె నిట్లు

కారడవిని పంక్తి కంఠునిచేత
పట్టు వడ్డట్టి యీ పడతి తొడమీద
పెట్టుకొని యున్నాడు పృథ్వీశు డనుచు
* * * * *

తలచి లక్ష్మన నేడు తానవ్వె ననుచు
ధాత్రిసుత కొలువులో తలవంచుకొనెను.
సభవిడి చెడియున్న, సర్వేశ్వరులును
అతివ ముఖమును జూచి అట చిన్నబోయె.

సభ్యులందఱు ఆత్మపరీక్షలో మునిఁగిపోవుటచేత కార్య క్రమము నిలిపివేయఁబడినట్లయినది. చిన్నఁబోయిన సభ నంతయు రామభద్రుఁ డొకసారి కలయఁ జూచినాఁడు. సభ్యు లందఱు తలలు వంచుకొని నీరవులై తమ స్థానములలో ఆసీనులై యుండుటను గమనించినాఁడు. లక్ష్మణస్వామి హేతు రహితమైన నవ్వే ఇందఱ నవమానపఱచినదని ఆగ్రహోయత్త చిత్తుఁడై రాఘవుఁడు లక్ష్మణుని తలనఱకుటకు సిద్ధపడినాఁడు.

సమీపమున నిలచియున్న సచివులు, సామంతులు శ్రీరాముని వారించి, 'లక్ష్మణుని నేరమును మన్నించి రక్షించు'మని వేడుకొన్నారు. అప్పుడు రామచంద్రుఁడు తనకు కలిగిన కోపము నణఁచుకొని "లక్ష్మణా! ఇంతమందిలో కారణము తెలుపక నవ్వి, ఇందఱ నవమాన పఱచినావు. నవ్విన కారణము ఈ నిండుకొలువులో చెప్పి, నీ ప్రాణము కాపాడు కొనుము!" అని గద్దించి పలికినాఁడు.

శ్రీరామునకు అపరిమితమైన ఆగ్రహము కలిగినదని యాతని జేవురించిన ముఖమును, కంపమొందిన దేహమును

గమనించిన సభ్యులు భీతిల్లినారు. భూదేవి గడగడలాడినది. 'శ్రీరామునకు కోపము రానేరాదు-వచ్చిన ఊరకపోదను విషయ మందఱును ఎఱిఁగినదే! ఆసన్న ప్రళయమున కందఱు భయకంపితులైనారు.'

ఇఁక సీతమ్మకు శ్రీరాముని జూడఁగనే అగ్నిపర్వతము బ్రద్దలగు సూచనలు కానవచ్చినవి. కోపావేశములో క్రిందు మీఁదు తెలియని రాఘవులు ఎదురులేని తన రామబాణమును ఎక్కడ ప్రయోగించునోయని భీతిల్లి, రామచంద్రుని శాంత చిత్తుని చేయఁజూచినది. కుసుమకోమలమైన తన మృదుహస్తములతో దాశరథి పాదసరోజములను స్పృశించినది.

అంతలో లక్ష్మణస్వామి లేచి అన్నగారితో తానునవ్విన కారణమును తెలిపినాఁడు:

''అత్యంత వరమూర్తి! అతిదాయకుడవు
ఆశ్రితామరభూజ! అఖిలేశ్వరుడవు
రాజభోజుడ వీవు రామచంద్రుడవు
ధర్మచారిత్రుడవు తర్కమేమిటికి?
ముందు మన మడవులకు బోయున్ననాడు
తల్లిని దండ్రిని దలచకుండగను
కంటికి రెప్పవలె గాచి క్షేమమున
వీడక యయోధ్యకు తోడి తెచ్చుటకు

* * * * *

మును పర్ణశాలలో మన ముండగాను
పరమాత్మ మీ నెరపగా జూచి
ఉండగానె వచ్చె ఉత్తమము నిద్ర
రెండు జాములవేళ మెండుగా వచ్చె.

నేను విల్లంబు లందుకొని 'ఎవరు నీవు? ఇంత సాహసముతో నా నియమములను భంగపఱచవలెనని చూచుచున్నావు?' అని గద్దించి యడిగితిని.

'అష్టదిగ్గజములను అది మహాబుధుల
వైకుంఠ నాథులను వసియింతునేను.
సప్తసాగరముల చవుటి పడియలను
పారేటి నదులను భ్రమియింతునేను.
పక్షుల జాతులను పర్వతమ్ములను
వృక్షాల పైనుండి విహరింతు నేను.
నరుల నెవ్వారును నను గెల్వలేరు.'

అని నిద్రాదేవి తన నైజబుద్ధిని బయలుపఱచినది. నేనామెను వేడుకొని, అన్నగారిని సేవించ వలసి యున్నదనియు, నా అర్ధాంగియైన ఊర్మిళకు నావియోగ వేదన తెలియకుండ నుండుటకుగాను ఆమెనే ఆవహించవలసినదనియు, అయోధ్యానగరిలో అడుగు పెట్టగానే నన్ను ఆవహించ వచ్చుననియు చెప్పి, రక్షింప వలసినదిగా ప్రార్థించినాను. ఆప్రకారముగానే మనమయోధ్యాపురము ప్రవేశించిన దగ్గఱ నుండియు ఆదేవి నన్నావహించినది. కునుకు మీాద కునుకు వచ్చుటతో నా దేహము ఊఁగిపోవుచున్నది. నా నవ్వునకిదే కారణ"మని లక్ష్మణుఁడు నిద్రాముఖముతో రాఘవులకు నివేదించినాఁడు.

దుష్టుల యెడల కఠినముగా ప్రవర్తించు శ్రీరామచంద్రుని మానసము అనుంగు తమ్ముఁడు తన కొఱకు చేసిన త్యాగము స్మరణకు రాఁగానే ద్రవీభూతమైనది. పదునాలుగు

సంవత్సరములు దండకారణ్యములో భ్రాతృశుశ్రూషలు చేయుచు ఛాయవలె మెలఁగినాఁడు! కుందనపు బొమ్మయైన హృదయేశ్వరిని విడచి, తన పాదపద్మములనే సేవించుచు అనుసరించినాఁడు. లక్ష్మణుని భ్రాతృభక్తికి సాటి యేది?

తన ఏమఱుపాటును దలఁచుకొనిన కొలఁదియు శ్రీరాముని హృదయములో భరింపరాని ఆవేదన బయలుదేఱినది. వెంటనే తమ కులగురువైన వసిష్ఠమహర్షిని సమీపించి తనకు కలిగిన సంతాపమును నివేదించి, పాపపరిహారము చేయు నుపాయము తెలుపుమని ప్రార్థించినాఁడు.

ధర్మశాస్త్రములలోని సూత్రములు వసిష్ఠుల కెప్పుడును నాలుకచివరనే ఆడుచుండును. ఆ సందర్భమున మహర్షికి స్ఫురించిన సూత్రములనేకములు-కాని తన యెదుట చేతులుమోడ్చి నిలువఁబడినది సామాన్యప్రభువా? అతఁడు సర్వేశ్వరుఁడు, సర్వశక్తి, సర్వజ్ఞుఁడును అయిన సాక్షాన్నారాయణుఁడు, స్వయంప్రకాశ స్వరూపుఁడు! ఆ మహనీయునకీ విషయము తెలుపుటకు వసిష్ఠులు సందేహించినారు.

శ్రీరామచంద్రుఁడు ఎప్పటికప్పుడు అఘమర్షణస్నానము చేయవలెనను దీక్షగలవాఁడు. మహర్షికిఁ గలిగిన సందేహమును గ్రహించి 'ఏదిగానీ-చెప్పి తీరవలసినదే' యని పట్టు పట్టినాఁడు.

"రామచంద్రా! ఆ పాపము పాదములంటినఁగాని పరిహారముగాదు. లక్ష్మణస్వామి చిన్నవాఁడు కనుక నీ వాతని పాదములను ప్రత్యక్షముగా నంటిన అతనికి పాపము రాఁగ

లదు. అందువలన 'చిత్రపటములోని లక్ష్మణస్వామి పాదముల నంటు'మని వసిష్ఠమహర్షి చెప్పినాఁడు.

వెంటనే రాఘవులు తగు ఏర్పాట్లు చేయవలసినదిగ పరిజనులకు ఆనతిచ్చినారు.

పడినన్ని వీధులను ఊడిచేటివారు
వెసముత్యములముగ్గు పెట్టేటివారు
రత్న వల్లికలను వ్రాసేటివారు
కడు మకర తోరణాల్ కట్టేటివారు
నిండు కుండలు తెచ్చి నిలిపేటివారు

* * * * *

ఏడునిలువుల కనకపు మేడలోనున్న లక్ష్మణుని శయ్యాగారమును ముత్యాల తోరణములతోను రత్నాల రంగవల్లులతోను అలంకరించి, సువాసనలను వెదఁజల్లు పుష్పములతోను, వెన్నెలనిగ్గులు వెలార్చు ధౌతవస్త్రములతోను,హంస తూలికా తల్పము నేర్పాటుచేయించి, 'లక్ష్మణా! నీ శయ్యాగారమునకు వెళ్లి నిదురించవోయి' అని రాఘవులు తమ్మునకానతిచ్చినారు.

లక్ష్మణస్వామి అన్నగారికిని, వదినెగారికిని మ్రొక్కి భద్రగజమెక్కి శయనాగారమునకు వెళ్లినాఁడు. పదునాలుగు సంవత్సరములుగా కఠినశిలలపైన మేనువాల్చిన లక్ష్మణుఁడు, మృదువైన పాన్పు గోచరించఁగానే వివశుఁడై దానిపైని వ్రాలి, జాగ్రదవస్థను మఱచినాఁడు.

లక్ష్మణస్వామి యాగమనమును తెలిసికొన్న ఊర్మిళాదేవి అందెల రవళితో, మందగమనముతో శయ్యాగారమున

కేతెంచి హృదయేశ్వరునకు పాదాభివందనము చేసినది. ఆమె జీవితమున కది పర్వదినము. నిండుపదునాలుగు సంవత్సరములు భర్త ఆదేశప్రకారము జడపదార్థమువలె సుషుప్త్యవస్థలో ఊర్మిళ యుండిపోయినది. దశరథనందనుల పురాభిగమనమును విని జాగ్రదవస్థలోనికి వచ్చినది. లక్ష్మణస్వామి యతఃపుర ప్రవేశముతో ఊర్మిళకు పంచప్రాణములు లేచి వచ్చినవి. భగవత్స్వరూపమునుగన్న భక్తునివలె విపశురాలయినది.

నిద్రిమత్తులో మునిఁగిపోయిన లక్ష్మణుఁడు ఊర్మిళా దేవిస్పర్శ తన పాదములకు సోఁకగానే కన్నులువిప్పి చూచి నాఁడు. పన్నీటజలకమాడి,పునుగు, జవ్వాజి దేహమునకలఁదు కొన్న ఊర్మిళ పట్టు పుట్టముకట్టి-తీయని కోరికలతో-తేనె లొలుకు వలపులతో - భర్తతోఁడి సంభాషణమునకై నిరీక్షించుచు, చేతులు జోడించి తల్పమున కెదుట నిలువఁబడినది.

ఆమె మనోగతమును గ్రహించిన లక్ష్మణుఁడు 'నేను అన్నగారి సేవలోనుండి విడుదల కాలేదు. నీతోఁడి సమావేశమునకు అనుజ్ఞను పొందలేదు'అని ఊర్మిళకు అన్యాపదేశముగా సమాధాన మిచ్చినాఁడు. రఘువంశములోని ఉత్తమ పురుషులలో నొకఁడును, ఆదర్శ సహోదరుఁడును అయిన ఆ లక్ష్మణస్వామి-అన్నగారి అనుజ్ఞలేనిది 'పదునాలుగేండ్లుగా భర్తృదర్శన మెఱుఁగని అర్ధాంగిని పలుకరింపనేరఁడు!

ఈ సమయములో 'లక్ష్మణస్వామి ఏమి చేయుచున్నాఁడో చూచిర'మ్మని శ్రీరామచంద్రులు హనుమంతుని పంపినారు.

'చూచిరా హనుమన్న చూచిరావోయి
అతివతో ముచ్చటలె యాడుచున్నాడొ
చేడెతో జలక్రీడ లాడుచున్నాడొ'

అని ఆనతియ్యగానే నాలుగంగలలో హనుమంతుఁడు వెళ్లివచ్చి చెప్పినాఁడు. శ్రీరాముఁడు వెంటనే లేచి తమ్ముని శయనాగారమును ప్రవేశించి-పాన్పుమీఁద కూర్చుండి-లక్ష్మణుని పరికించినాఁడు. భ్రాతృసేవా తత్పరుఁడైన లక్ష్మణుని మొగము వీక్షింపఁగనే రాఘవులకు జాలికలిగినది. "ఈ లక్ష్మణస్వామి లేకున్న నా కష్టములు గట్టెక్కి యుండునా? నేను వారిధిని దాఁటియుందునా? నా సీత నాకు దక్కియుండునా? ఇతఁడు నా జీవనాధారము! ఇతని పాదములంటిన నేమితప్పు?" అనుకొని తమ్ముని పాదముల నంటినాఁడు.

పాన్పును జూచిన వెంటనే నిద్రాదేవికి వశుఁడైన లక్ష్మణుఁడు కలతనిద్రలో 'తన పాదములనంటిన దెవరు? పాపము! ఊర్మిళ తిరిగి వచ్చినది కాఁబోలు! తనతోడి సంభాషణమున కెంత పలవరించి పోవుచున్నదీ ఊర్మిళ! తాను అంతఃపురప్రవేశము చేసికూడ ఆమెను పలుకరించక పోయినాఁడు. ఆలేఁత హృదయ మెంత గంటువడెనో!' అని వికల మనస్కుఁడై కనులు విచ్చి చూచినాఁడు. అత్యాశ్చర్యముతో కన్నులు నులుపుకొని మఱొకసారి చూచినాఁడు. అది స్వప్నమేమోయని భ్రమించినాఁడు. మూఁడవసారి లేచి కూర్చుండి,పరిసరములను పరికించి, తన పాదములచెంత నాసీనులైన దెవరోయని బాగుగాఁ బరిశీలించి చూచినాఁడు. అతఁడెవరో కాఁడు—తన

జ్యేష్ఠ సహోదరుఁడైన శ్రీరామచంద్రమూర్తి! చివాలునలేచి అన్నగారికి ప్రణమిల్లినాఁడు లక్ష్మణస్వామి.

అల యహల్యను బ్రోచు నడుగు మీ యడుగు
బలిశిరస్సున నున్న యడుగు మీ యడుగు
మీ యడుగు లొత్తెదరు మేటి దేవతలు
మా యడుగు లొత్త శ్రీమన్నాథ! తగదు.

అని వారించినాఁడు. శ్రీరామచంద్రుఁడు తమ్ముని కౌఁగిలించుకొని 'లక్ష్మణా! చంద్రుఁడులేని రాత్రివలె—దీపములేని గృహమువలె—జీవకళలేని మానవునివలె-నీవులేని నా సభ వెలవెలఁ బోవుచున్నది. నీవుసర్వకాలముల యందును నాసమక్షముననే ఉండవలె'నని తమ్ముని తనవెంట తీసికొనిపోయి తన యొద్దనాసీనునిగఁ జేసికొని—తమ్ములకు మరదండ్రతోడి సమాగమమునకు తగునేర్పాట్లు చేయవలసినదిగ సోదరియైన శాంతమ్మకు రహస్యముగా వర్తమానమంపినాఁడు. కన్నుల పండువుగా వారినందఱను ఒక్కసారి తిలకింప నుత్సాహముగా నున్నదని తన కోరికను చెప్పి పంపినాఁడు.

శాంతమ్మ రాఘవేంద్రులకు గవాక్షముగుండ అంతఃపుర స్త్రీలను, తమ్ములను చూపించినది.

నవరత్న ఖచితమైన యాభరణముల నలంకరించుకొని పట్టుపుట్టములను ధరించి హంసనడకలతో మెఱవు తీఁగలవలె ఇటు నటు తిరుగాడు సౌందర్యరాసులను వీక్షించి శ్రీరామ

చంద్రుఁడు అబ్బురపడినాఁడు. 'ఆ మనోహర దృశ్యము వేయి కన్నులతో తిలకింపఁదగినది గాని బ్రహ్మ యిచ్చినది నేత్రి ద్వయమేకదా!' అని మానుషావతారమెత్తిన ఆదిదేవుఁడు కించపడినాఁడు. వారి ఆనందమును భంగపఱచునిచ్ఛలేక శుభ చరితుఁడైన శ్రీరామచంద్రప్రభువు తన యంతఃపురమునకు మఱలినాఁడు. అతని వెనుకనే నిలువఁబడియున్న సీతాదేవి మేఘము చెంతనున్న మెఱపుతీఁగవలె పతి ననుసరించినది!

# 2. సత్యభామ సరసము

దక్షిణానాయకుండైన శ్రీకృష్ణుని అష్టమహిషులలో అందఱు ఒకఎత్తును-రుక్మిణీ సత్యభామలు ఒకఎత్తును. వీరిద్దఱిలోఎవరుఅధికులో నిర్ణయించుటకు కృష్ణునకే అసాధ్యముగా నుండెడిది. ఎంతటి భోగలాలసుండైనను 'రుక్మిణీదేవియే నీకు అధికురా'లని హృదయము నొక్కి చెప్పుచున్నను ఆగోవిందుని నోటికి అప్రయత్నముగా 'సాత్రాజితియే నాకు ముఖ్యురా'లని వచ్చెడిది. అందువలన 'వాసుదేవుని మనసునకెక్కిన దాన'నని సత్యభామాదేవి తోడిమహిషులయొద్ద తన ప్రత్యేకతను చూపుకొనుచుండెడిది.

ఒక సాయంసమయమున సత్యభామాదేవి శ్రీకృష్ణ సందర్శనలాలసయై

పనులానతిచ్చెనే పరమాత్ము దేవి
అలుకరే పూయరే అరుగుల మీద
చిలుకరే కస్తూరి శ్రీఘంబుగాను
సున్నగా కస వూడ్చి పన్నీరు జల్లి
పన్నుగా గడపల పసపు కుంకుమలు
ముత్యాల ముగ్గులు మురువొప్పబెట్టి
రత్నాల వల్లికల్ వ్రాసేటివారు
మాణిక్యముల దివ్వె మానుగాబట్టి
కనువిందు తోరణాల్ కట్టేటి వారు
సూత్రాన సున్నంబు సొగసుగా పూసి
వే పచ్చ పందిళ్లు వేసేటివారు
పసుపుటాకుల చళ్లు పసమీరగట్టి
ఇంపైన స్తంభాల నెత్తేటివారు

కస్తూరిలు వాసనలు కలిపేటివారు
తేట శ్రీగంధముల్ తీసేటివారు

*　　*　　*　　*　　*

వారిజాక్షుడు నాడు వారింటి కడకు
వరుసదినమ్ముగా వచ్చుట యెరిగి
పచ్చగా వేసిన పందిళ్లు మెరయ
మెఱుగుటద్దము తెచ్చి మెఱుగు తుడిపించి
ఏడునిల్వుల పైడి మేడలోపలను
పైడి తఱమెనకోళ్ల పట్టె మంచమ్ము
హంసతూలిక పాన్పు నలచు జాలారు
అచ్యుతులు కూర్చుండ నమరిన పాన్పు
శృంగారరాయని చెంగల్వ పాన్పు
బంగారు జలపోత పాన్పున పరచి
పొన్నలు బొగడలు బొండు మల్లెలును
ఆమంచి పాన్పున అవి చాల పరచె
జామున పూసిన జాజిపూవులను
ఆ మంచి పాన్పున అవి చాల పరచె
అప్పుడే పూసిన అచ్చమల్లెలను
ఆ మంచి పాన్పున అవి చాల పరచె

సువాసనలు విరజిమ్మె పుష్పరాజములతో మేలైన పాన్పుచు మేఘవర్ణుని కొఱకు ఆయత్తపఱచినది.

తాను పన్నీట జలకమాడి, సుగంధద్రవ్యములతో, మైపూంతనలందికొని, మేనికాంతికిఈడైనచక్కని పట్టుపుట్టము ధరించినది. సుదీర్ఘములైన నీలంపుకురులను చక్కగా దువ్వుకొని, ముత్యాలపాపట నమర్చుకొన్నది. కస్తూరితిలకము దిద్దుకొని, రత్నాభరణములతో అలంకరించుకొని, అరవింద

నాభుని కొఱకు ఎదురుతెన్నులు చూచుచు చెక్కిట చేయి చేర్చుకొని, చెలికత్తెల నడుమ సత్యభామాదేవి ఆసీనురాలైనది.

ఆ దేవి అందాల బరణి-శ్రీకృష్ణప్రాణప్రియ! తన లోకోత్తర సౌందర్యమునకు మెఱుగులు దిద్దగలిగిన ఆభరణములను ఒక్కొక్కదానినే సవరించుకొనుచుండగా వాటిని తన వల్లభుడు ఏయే సమయములయందు బహూకరించి, మురిపించి, మురిసినాడో-ఆతీయని తలంపులు ఒకటి తరువాత నొకటిగా ఆమె మనసున మిలమిల లాడినవి. ఆమధురస్మృతుల వలన శరీరము పులకలు దేఱగా-పుక్కిటనున్న పండుటాకుల కప్పురపువిడెము ఘుమాయింపగా - చెలులతో సత్యభామాదేవి తన వేదనలను వెళ్లబుచ్చుకొనినది.

రాత్రి రెండువయామము కూడ దాటిపోవుచున్నది. భర్త ఆగమనమునకై ఎదురుచూచుచున్న సతికి క్షణమొక యుగముగా కనబడుచున్నది! ఆమె మానసము పరిపరి విధములుగా పరుగులెత్తజొచ్చినది. రాజీవలోచనుడు ఎంతకును రాడు! గోపస్త్రీలతో రాసక్రీడలే సలుపుచున్నాడో-తన దేవేరులతో సరసమే ఆడుచున్నాడో - లేక - తనతో సదా పోటిలుపడు రుక్మిణీదేవితో పాచికలనే ఆడుచున్నాడో! నారదమునీంద్రుల ఎదుట-అంతమంది సవతుల సమక్షములోను - ఆ రుక్మిణీదేవి పారిజాతమును ముందుకు ముందుగా అందుకొన్నదా లేదా? సురలతో యుద్ధమాడి పారిజాత వృక్షమును తెచ్చి తానే పెరటిలో నాటుకొన్న

ప్పటికిని, నారదమునీంద్రుఁడు తన కర్పించిన పుష్పమును అందఱిలోను ఆరుక్మిణీదేవికే శ్రీకృష్ణుఁడిచ్చుట సత్యభామాదేవికి హృదయబాధను కలుగఁజేసి, అప్పుడప్పుడు కెలుకుచునే యుండును. ఇప్పుడు కూడ పారిజాత సుమవృత్తాంతమువంటి దేదయిన జరిగినదో—లేక యమునానది యొడ్డున ఇసుకతిన్నెల మీఁద ఒంటరిగా కూర్చుండి పిల్లనగ్రోవితో మధురమోహనమైన గానమే చేయుచున్నాఁడో!—ఏదయినను వెన్నుఁడు తనను పూర్తిగా మఱచినట్లే కనఁబడుచున్నది.

గోపాలుని కొఱకు నిరీక్షించి నిరీక్షించి అఱమోడ్పు కన్నులతో సత్యభామాదేవి చెలికత్తెల మీఁదికి ఒరగి పోయినది.

అంతలో గరుడవాహనారూఢుఁడై శ్రీకృష్ణుఁడు సత్యభామాదేవి యంతఃపురమును సమీపించినాఁడు.

వాసుదేవుని రాకను అల్లంతదూరమునుండియే గ్రహించి, చెంగునలేచి పాన్పునమరించిన గదిలోప్రవేశించి సత్యాదేవి వాఁకిలి మూయించినది.

పైఁడిచెంబులతో ఉదకమును తెచ్చి వాసుదేవుని పాదములు కడిగి, వీవనలతో విసరి, దాసీజనము దేవకీ తనయునకు ఆసనము నేర్పాటుచేసినారు.

గోవిందునకీ మర్యాదల మీఁదను మన్ననల మీఁదను మనసు లేదు! అతఁడు సాత్రాజితి కొఱకు నురుఁగులు గ్రక్కుచు పరుగుల మీఁద వచ్చినాఁడు. అంతదూరమునుండి అలసిసొలసి వచ్చిన స్వామిని ఆదరించక ఆమె కవాటములను

బంధించుకొన్నది! కొత్త అవాంతరమేదయిన చెలుల పుణ్యమున వచ్చినదో—లేక ప్రీతవేవయిన సెలలు వేసిన వో!

గోపాలుఁడొకచోట ఆసీనుడై చెలులచే కవాటమును తట్టించినాఁడు.

"మీరెవ్వరు? పేరు తెలుపక లోపలికి రాపీలులేద''ని గదిలోనుండి ఒక కిన్నెర కంఠము ప్రశ్నించినది.

లీలామానుషరూపధారియైన శ్రీకృష్ణుఁడు సత్యభామాదేవి యెడ అతివినయమును చూపించినాఁడు.

కృష్ణ:— పేరు మీదా నీకు ప్రేమాయెనేమొ!
వనితరో గోపికా వల్లభుడ నేను;

సత్యా:— గోపికా ప్రియుడైతె రేపల్లెనుండు
ముద్దరాళ్ల కడకు పొద్దున్నె పొమ్మి;
కృష్ణ:— జలధరు డందురే చెలియ నాపేరు
సత్యా:— జలధరుడైతేను స్థలము నీకేల?
కృష్ణ:— నరసింహు డందురే నాతి నాపేరు
సత్యా:— నరసింహుడైతేను కరికాశపడుము;
కృష్ణ:— వెంకటేశ్వరుడందు్రు వెలది నాపేరు
సత్యా:— వెంకటేశ్వరుడైతె వెళ్లు తిరుపతికి;
కృష్ణ:— గోవిందు డందురే కొమ్మ నాపేరు
సత్యా:— గొందివో కొండవో గొడవ నేనెరుగ;
కృష్ణ:— అచ్యుతుడందురే అతివనాపేరు
సత్యా:— అచ్యుతుడో ముచ్చొ అదినేనెరుంగ;
కృష్ణ:— బలభద్రు డందురే పడతి నాపేరు
సత్యా:— బావవో మరదివో బాగు నేనెరుగ;
కృష్ణ:— శ్రీకృష్ణు డందురే చెలియ నాపేరు
సత్యా:— చీరెవో రవికవో చిన్నె లేనెఱుగ-

ఇన్ని విధములుగా వివిధనామములు చెప్పినను దేవి తలుపుతీయదు. 'హృదయాంతరాళములోఁజొచ్చి ఆమెను కలవరపఱచు విషయమేమయి యుండును?' అనుకొని, "భామా! నీ మృదుపాదములను మఱొకసారి స్పృశించనా? కవాటము బంధించినావెందుకే! చిటిపొటి అలుకలతో అలమట పొందెదవెందులకే?" అని సానునయముగా పలికినాఁడు.

సత్యభామ ఎంతటి ధీరయైనను ఆమె హృదయము వెన్నుని యనునయపు పలుకులకు వెన్నవలె కరఁగి పోయినది. అంతవఱకును పడకమీఁద పవళించియున్న సత్య, దిగ్గున లేచి, వెంటనే తలుపులు తీయవలసినదిగా చెలులకు ఆజ్ఞయిచ్చినది.

శ్రీకృష్ణుని దర్శనమునకు–ముత్యాల మేలిముసుఁగులో నుండి–అందాలుచిందేటి ఆయింతి ముఖబింబము విద్యుల్లతవలె ఒక్కసారి ప్రకాశమానమై – చిఱుకోపము చిందులాడగా వెంటనే ముకుళించుకొనిపోయినది.

అచ్యుతుఁడు దేవిని శాంతపఱుపవలెనని వేయి పన్నాగములు పన్నినాఁడు.

కృష్ణ:— అలుకలేటికి నీకు అంభోజగంధి
కోపమేటికి నీకు కువలాయతాక్షి
కాంతరో నినువీడి గడె యుండగలనె
నామనం బెఱుగవా! నలినాయతాక్షి!
సత్య:— అటు నిన్నెఱుంగ బ్రహ్మాదుల తరమె?
మనసులో మాటకు మనసదే సాక్షి
మాయదారి వటన్న మాట యెఱుగుదును.
కృష్ణ:— మావల్ల తప్పులు మరిగలవేని
ఎన్నక మమ్మిపుడు మన్నింపవలెను

ఈ ప్రాధేయంపు పలుకులకు సత్యభామాదేవి నీరేజ పత్రములవంటి నేత్రములను పైకెత్తి కృష్ణుని వీక్షించినది. చక్రధరుని చెక్కిళ్ళపైని కాటుక-కట్టు పుట్టములనిండ పసుపు ఆమెనురోషకషాయిత నేత్రను చేసివేసినవి. కులమును, రూపమును,మగని కూరిమియు గలదాననియు—మానవతిననియు, మహనీయ సౌభాగ్యవతిననియు ఆత్మవిశ్వాసము కలది సత్యభామాదేవి. అంతేకాక స్వాధీనపతికనని గరువము కలది. గరువమనగా ఎంతభాగ్యము! ఆత్మవిశ్వాసమే ఒకగురిగింజ పాటిఅధికమైన అదియే గరువము!

ఇంతకును అటువంటి సత్యభామాదేవియెడ క్షమింపరాని అపరాధమేదో మాధవుని వలన జరిగిపోయినది. ఈ అపచారమేకాకుండ మఱొకటి-సత్యసహింపరానిది ఆమెకంట పడినది. నిత్యము మాధవుని కంఠసీమ నలంకరించు మణిమాల నేఁడు కానరాదు! అనవరతము గోపాలుఁడు తన చిటికెన వ్రేలికి ధరియించు రత్నాలముద్రిక నేఁడు వ్రేలికిలేదు! ఇంత పరాయత్తచిత్తుఁడై - నిర్లక్ష్యవేషధారణతో తనదాఁపున కేతెంచినవాసుదేవుని చెయిదములకురోషము, కోపము పెనఁగొనఁగా, సత్యభామాదేవి, వ్రేటువడ్డ ఉరగాంగనవలె చెంగున లేచి''వ్రేలి ముద్రిక నెవరిచేతికలంకరించినా''రని కర్కశస్వరముతో ప్రశ్నించినది.

ఆమాటకు రుక్మిణీ వల్లభుని యెదలో చిలిపితనము పొడసూపినది. ''రుక్మిణీదేవి వ్రేలికి అలంకరించినా'' నని నిర్భయముగా వగలమారి మాధవుఁడు జవాబిచ్చినాఁడు.

వెనుకముందులు చూచుకొనకుండ—పరోక్షమున జరిగిన నిర్లజ్జవ్యాపారమును తెచ్చి తనసమక్షములో, వన్నెచిన్నెలుగా మాధవుఁడు వర్ణించి చెప్పఁగా—అందులకు సత్యసుకుమార హృదయము భరించలేకపోయినది. అందులో ధనమిచ్చి పుచ్చుకొన్నను భరించవచ్చును గాని—అనన్యసామాన్యమగు భర్తృవాల్లభ్యముగలదానననిపొంగిపోవుయువతి—తన హృదయేశ్వరుఁడు చనవిచ్చి తిరిగి పుచ్చుకొనిన సహించఁగలదా? ఆమెకు దుఃఖము పొంగుకొని వచ్చినది.

సత్య:— పడతి రుక్మిణి నీకు పట్టంపుదేవి,
ఇలకెంత బరువైతి! నెంచి నాతండ్రి
చిన్ననాడే విషముచే చంపడాయె!
ఇందరు సవతుల ఇంతులమీద
నిన్వొదకి తాదెచ్చి నీమెడకు గట్టె
ఇంత పలపక్షమా ఇందీవరాక్ష!

అని నిష్ఠురమాడినది.

శ్రీకృష్ణుఁడు ఏ పసులకాపరియైనను పదునారువేల స్త్రీలయొక్క మన స్తత్త్వమును బాగుగా శోధించి యెఱిఁగిన అనుభవజ్ఞుఁడును, స్వాధీన వల్లభుఁడే కాక దక్షిణనాయకుఁడు కూడను. అందును ఈర్ష్యానలముచే దహింపఁబడు హృదయమును ఇట్టే కనిపెట్టఁగల ఇంగితజ్ఞుఁడతఁడు. మత్సరముచే దహింపఁబడుచున్న సాత్రాజితిని అనునయింపఁ జూచినాఁడు.

కృష్ణ:— పలపక్షములవి మావద్దనే లేవు
పక్షపాతమనంగ భామ నేనెరుగ
మీర లిద్దరు నాకు కూరిమిని రెండు

కన్నులు గాదటే! కనకాంగి! నిజము
మీ తండ్రికడనుండి మెఱుగు మానికము
మాణిక్యమే పోయి మచ్చ నామీద
పడజాంబవంతుని బవరమున గెల్చి
నిన్ను పెండ్లాడితి నెలతరో! వినుము
ఎంతచేసిన మెచ్చ వింతిరో! నన్ను,
ఇంతైన నామాట ఇంతి! నమ్మవుగా!
దేవేంద్రు డాదిగా దేవాళి గొట్టి
పారిజాతము తెచ్చి కూరిమిమెఱయు
నీతోట పాతనే నీరేజగంధి!

సత్య:— అయిన పువ్వులు ప్రియకు సర్పించినావు!

తప్పులను వెదకుటలోను-కనబడినదానిని రచ్చకీడ్చుట లోను సత్య మంచి నేర్పరి.

శ్రీకృష్ణుని ప్రాంతపాచికలును పథకములును సత్యాదేవి దగ్గఱ ఈ పర్యాయము సాగిరాలేదు. కనుక కొంత తడవు యోచించి క్రొత్త చిట్కాను ప్రయోగించి చూచి నాడు.

చక్కని దానవు సకియరో! నీవు-
నల్లనివాడనని ఒల్లవే నన్ను!

ఈ మాటకు సత్యాదేవి కోపభరముతో మ్రింగిపోయి నది. "ఇంతమంది భార్యలలోను-అంతమంది గోపికాస్త్రీలలోను నేనే నీమదికెక్కిన దాసనని — మనమే అరమరలులేని కూరిమితో విహరించుచున్నామని — ఏయభిసారికయో పుట్టించిన

ప్రల్లదము సుమా! నేను చక్కనిదాన ననుమాట అటుంచి నీవు నల్లనివాఁడవని నేనెన్నఁడయిన అని యెఱుఁగుదునా? నామానసము నీవెఱుఁగనిదా? అయిననునన్ను నిష్ఠురపెట్టుట కేనా నీవింతదూరము వచ్చినది? పోనీ...అక్కడే...ఆరుక్మిణీ దేవి యింటనే ఉండక పోయినావా?'' అని ఎత్తిపొడిచినది—కడకు కళ్లకు నీళ్లు తెచ్చుకొన్నది.

సత్యయీసడింపు ఎక్కువయినకొలఁది ధూర్తగోపాలుని అతి వినయము ఇనుమడింపసాగినది.

కృష్ణః— ఉవిదరో! నిను జూడకున్న నదొక్క
నిమిషమే యేండ్లుగా నిక్కంబు దోచు
కమలాక్షి! గడెయైన కానరాకున్న
కాంత! నాకన్నుల గట్టినట్లుండు.

అని శాంతపఱుపఁజూచినాఁడు.

''ఎప్పుడును ఎక్కడికిని వెళ్లనని అందువే! ఇప్పుడీ తిరుగుట నేమందువు?'' అని సత్యభామ వెనుకటి ధోరణి లోనే తిరిగి ప్రశ్నించినది.

ఎంతసేపు బ్రతిమిలాడినను సత్యభామ త్రోవకు వచ్చు మార్గము, ధోరణియు కనఁబడలేదు. కడకు శ్రీకృష్ణుఁడు తన చమత్కృతినంతయుపొందుపఱచి ఒకఉపాయము పన్నినాఁడు.

''నేను సదా ఇల్లిల్లు తిరుగుచుందునని అందువే! ముద్దినుసుచీరలు, రవికెలు తెచ్చియిచ్చి—అతులితమైన ఈ భోగభాగ్యములను నీకు సమకూర్చు నాయకుఁ డెవరు?'' అని

ధీరత్వముతో గోపాలుఁడు సంభాషణమును ఎదురుతిప్పి నాఁడు.

అలుకలో ఊపిరిసలుపక కొట్టుకొని పోవుచున్న సత్య, ఈమాటలకు విస్మయపడినది. అయినను ఆమెకూడ వాక్చాతుర్యముగల ప్రజ్ఞాధురీణ. తనకు కలిగిన విస్మయమును మఱుఁగుపఱచి వెంటనే సమాధానమిచ్చినది.

శ్రీకృష్ణ! చెప్పెదను చెవియొగ్గి వినుము
మాయదారీవాడు మరి తంత్రగొట్టు
అబద్ధాలాకోరు ఆకటికోరు
నల్లని వాడైన నగుమోమువాడు
కళలు గల్గినవాడు కాంతిగలవాడు
భార్యలుగలవాడు పరమ పావనుడు
ఉరమున శ్రీదేవి నుంచుకొన్నాడు
ఆతని చెక్కిళ్లు అద్దాల బోలు
మకరకుండలములు మరి పెట్టువాడు
పిల్లనగ్రోవితో వెలయుచున్నాడు

అతఁడే నా సౌధములో-నాహృదయములో బందీఅయి యున్నాడు. అతనితో పోరాటము నీకుసామాన్యమా? ఆయనఎక్కడ-నీవెక్కడ? లేని పోని పంతాలు మానుకోవయ్యా?'' అన్నది.

''ఆఁ, అట్లాగా! అయిన నేను నోరు మెదల్పక ఊరకొనుటయే ఉత్తమము. నేను నీకేమీ ఎదురాడ లేదుకదా!'' అని కొంటెచూపులతో ఆమెను వీక్షించుచు భయము నభినయించినాఁడు.

సత్య కోపభరాలసయై-ప్రక్కనున్న చెలిమీదికి ఒరగి పోయినది. "పాపము! ఈమెది ఇంతమంది సవతులమీఁది బ్రతుకు!" అని చెలులు ఓదార్చినారు.

తన ఉపాయము లన్నియు బూడిదలో పోసిన పన్నీటి చందమున వృథా అయిన వని గోవిందుఁడు, మఱొక యుపాయమును ఆలోచించి "నాకిక్కడ నిలుచుటకు ఒక్కక్షణమైనను లేదు"దని గిరుక్కున మళ్లీ ద్వారమును సమీపించినాఁడు.

సత్యభామ నివ్వెఱ పోయినది. అతనిని ఎదుట బెట్టుకొని, నిష్ఠురపెట్టుచు సాధించవలెనని ఆమె తలంపుగాని- అతడు వెడలిపోయిన స్వారస్యమేమున్నది? ఆమె దిగ్గున లేచి మంచము దిగి గోపాలుని పట్టుచేలాంచలమును ఒడిసి పట్టినది.

విజయము లభించినదను సంతోషములో - మందహాసము పెదవులమీఁదచిందులాడఁగా "నీవుఅత్తవారింట పాదమిడిననాఁడు, మీవారు నీకు ఏమిసుద్దులు చెప్పి పంపినారు?" అని మాధవుఁడు ప్రశ్నించినాఁడు.

"ఓహో! ఆ సుద్దులు వినవలెనని వేడుకగా ఉన్నదా? తగినరీతిగా నాయకుని శిక్షించుమని విన్నపము లాయెను" అని పంచమస్వరములో సత్య గీతికను ఆలాపించినది.

"కోలచేతఁబట్టి శిక్షించవే కోమలాంగీ! అందులో నీవు ఆరితేఱిన దానవేకదా!" అని గోపాలుఁడు తలవంచుకొని సత్యచేతికి బంగారుకోల నందించినాఁడు.

స్వర్గధామమునకు అంతిమసోపానమును సమీపించిన ఆ సరససముద్రములో కాలునిలువఁద్రొక్కుకొని-కోలనక్కడనే పాఱవేసి-జగన్నాటక సూత్రధారిపాదముల చెంత, సత్య వివశురాలయి పడిపోయినది.

చిఱునవ్వు ముఖము మీఁద చిందులాడఁగా-తన గెలుపున కానందము పొంగులు వాఱఁగా "ఇంక కొడుకులను కనవే కుసుమసిరిగంధీ" యని సాత్రాజితిని దీవించి సాదరముగా వాసుదేవుఁడు లేవనెత్తినాఁడు.

# 3. ధర్మాంగద చరిత్ర : పాముపాటు

వినోదకాలక్షేపముకొఱకు సాగటాలాడుచున్న సమయములో గౌతమమహర్షిని లోకాభిరామాయణము లోనికి దింపిన అహల్య, 'పంచమహా పతివ్రతలతో సరితూఁగఁ గలిగిన పతివ్రతలు మానవలోకములో ఎవరైన కలరా?' అని ప్రశ్నించినది. అరచేతిలోని పాచికలను కదలించుచు పందెమును గుఱించి ఆలోచించుచున్న మహర్షి 'వీరికంటె ఘనులైన పతివ్రతలే ఉన్నారు' అని యాదాలాపముగా జవాబిచ్చినాఁడు. అప్పటి వఱకును ఆడుచున్న ఆటను ఎత్తివేసి, ఆ వీర పతివ్రత చరిత్రను చెప్పుమని అహల్య పట్టుబట్టినది.

తనతో సరితూఁగఁగల పతివ్రతలు లోకములో లేరను అహంభావము కలది అహల్య. కేవలము ఆమె గరువమును అణఁచదలఁచి 'మీ కంటె ఘనులే ఉన్నా'రని ధీరవచనము లాడినాఁడు-గాని భూలోకమును గుఱించి మహర్షి అంతకు పూర్వము ఆలోచించలేదు. సమాధానము కొఱకు ఆలోచించుచు ఉన్నట్లు కనఁబడెనా 'అంతయు అబద్ధము-కేవలము కల్పించిన కథ' అని అహల్య అనుమానించఁగలదని మనసులో భయము కలిగినది. నిమీలితనేత్రుఁడై ధ్యానసమాధిలో మునిఁగి, తనజ్ఞానచక్షువును భూలోకసంచారము చేసి పతివ్రతలను గుఱించి తెలిసికొని రమ్మని మహర్షి పంపినాఁడు.

కాంతికిరణములకంటె కడు వేగముతో జ్ఞాననేత్రము భూలోకసంచారము చేసి, మహర్షి కోరిన గాథను ఇసుక నేల మీఁద ఆణిముత్యములతో కూర్చి నివేదించినది.

తానాడినమాట నిజముగా గెలిచినందులకు అపరిమితా నందమును, ఆవీరపతివ్రతా మాహాత్మ్యమునకు విస్మయమును కలిగి గౌతమ మహర్షి అహల్యాదేవికి కథను వినిపించినాడు.

భువిలోన కాశ్మీర పుణ్యదేశంబు
అన్ని దేశములందు అధికమైయుండు
ఆ పురంబందున్న యంపమ్మువెల్ప
అజునకైనను గాని యలవి గాదయ్య
సంగీత సాహిత్య సంపదల్ గలిగి
వేదముల్ వల్లించు విప్రులే గలరు
చదువ సాములచేత చాల పెంపొంది
రాజు లా పురిలోన తేజమై గలరు
అల కుబేరుని రాజ్య మతని పట్టణము
కుదువ బెట్టగ జాలు కోమట్లు గలరు
పలుకు బొంకులులేక పలు సంపదలను
శూద్రు లా పురిలోన సొంపంద గలరు
రత్నాల మేడలు రంగైన గుడులు
ఏవిధి చూచినను ఏపుగానుండు
కనకాపురము పేరు ఘనులు మెచ్చగను
ఆ పురంబేలెడి యవనినాథునకు
ధర్మాంగదుండని ధరణి ప్రఖ్యాతి
ఆ ప్రభుం డేలేటి యా రాజ్యమందు
ధర్మహీనులు లేరు తలచి చూడగను
పెద్ద యుండగ చావు పిన్నలకులేదు
ఆ రాజు పాలన మది యేమొగాని
పేదసాదలు లేరు భిక్షుకుల్ లేరు
ఊరూర శుభములు కోరి చూడగను
ధర్మాంగదుండేలు ధరణిలో ప్రజకు
ధర్మబుద్ధులుగాని తటవిటల్ లేవు

ఆరాజదంపతుల అన్యోన్యము వాగర్థములవలెను, వారి అనురాగము పూసలోనిదారమువలెను ఆదర్శముగానుండెను. ఆ విధముగ కొంతకాలము గడచిన తరువాత అతులితభోగ భాగ్యములతో నోలలాడుచు కష్టమను మాట యెఱుఁగని ఆ రాజదంపతులకు జీవితములో వెలితియు, మనసులో అసంతృప్తియు కలుగ నారంభించినది. 'పుత్రులు లేని వారికి దివ్య లోకములు లేవు సరికదా గతులుకూడా లే'వని క్రుంగిపోవుచు ధర్మాంగదరాజు చింతాసాగరములో మునిఁగిపోయినాఁడు. గొడ్రాలి జీవితము వ్యర్థమని రాణి అర్మిలీదేవి వ్యసనపడ నారంభించినది. సంతానార్థము ఎన్నియో నోములు నోచినది. ఇలవేల్పులకుముడుపులుకట్టినది.ఎందఱు దేవుళ్లకో మ్రొక్కినది.

కొంతకాలమునకు ఆ దంపతుల ప్రార్థనలను దైవ మాలకించినట్లుగా రాణి గర్భవతి యయినది. తమ ప్రభువునకు పుత్రోదయము కానున్నదని ప్రజలు ఆహ్లాదపడినారు. మంత్రి ఉప్పొంగిపోయినాఁడు. ఇఁక రాజదంపతుల ఆనందమునకు అవధులే లేవు.

రాణికి నవమాసములు నిండినతరువాత ఒకనాఁటి ఉదయమున అంతఃపుర పరిచారకులందఱును అలజడిగా అటునిటు తిరుగుచు మంత్రసానిని పిలుచుకొని వచ్చినారు.

ఆవార్త గడియలో పట్టణమంతయు వ్యాపించినది. పండితులు, జ్యోతిష్కులు, రాజుగారికి పుత్రోదయముకాఁగానే చేయవలసిన దానముల పట్టికను సిద్ధముచేసి, మంత్రిపుంగవున

కందజేసినారు. దానికి తగిన సన్నాహములు జరుగసాగినవి. శాస్త్రజ్ఞులు పంచాంగములు దగ్గఱపెట్టుకొని జన్మించబోవు రాజకుమారుని భవిష్యము నూహించ నారంభించినారు.

అంతలో దేవేరిప్రాసాదమున దాసీజనుల సందడి అధిక మైనది-పురిటిగదిలోనుండి బుసబుసలు వినిపించినవి! అదేమో నని అందఱును భయభ్రాంతులై నిలచిపోయినారు. రెండు నాలుకలతో- గోదుమరంగులో-మిలమిల మెఱసిపోవు దేహ ముతో శేషుఁడుదయించి, కృష్ణపాదచ్ఛాయలుగల పడగను విప్పి ఆడనారంభించినాఁడు.

భుజంగదర్శనమునకు మంత్రసాని అడలి పోయినది. దాసీజనము భయకంపితులైనారు. రాణి అర్మిలీదేవి మూర్ఛ పోయినది.

దాసీలు ధర్మాంగద మహారాజున కీ వార్త నందఁజేసి నారు. పుత్రోదయ మగుననియు, భూరిదానము లీయవలె ననియు, అమందానందముతో సంబరపడుచున్న ప్రభువు ఈ దుర్వార్తను వినఁగానే "ఏ జాతికి ఆ జాతి సంతానమువల్ల ఆనందముగాని అన్యజాతి సంతానము వలన నది కలుగ నేరదు. నేనేమి పాపము చేసినానో నన్నీవిధముగా దైవము శిక్షించి నాఁడు! ఇంక నేను తలయెత్తుకొని తిరుగఁగలనా?" అని తల పట్టుకొని దుఃఖించినాఁడు.

మంత్రి తనకుఁ గలిగిన తత్తరపాటు సర్దుకొని, రాజేం ద్రునకు ధైర్యము చెప్పి-దేవేరిప్రాసాదమును సమీపించినాఁడు. నాగదర్శనమున కాశ్చర్య భయములకులోనై, ఆ చిన్న ప్రభు

వునకు నమస్కరించి, పేముపెట్టెలో శయ్యనేర్పఱచినాఁడు. అంతఃపురములో ఆ పెట్టెను భద్రపఱచి, యువరాజు నిమిత్తము మంత్రముల నెఱిఁగిన దాసీల నిద్దఱను నియమించి నాఁడు. యువరాజునకు పరిచర్యలు చేయుట తప్ప-అతనిరూపు రేఖలను గుఱించి బయట ప్రసంగించరాదని కఠినమైన కట్టడి చేసినాఁడు.

అంతఃపురములో పరిచారికాజనము ఉచితరీతిని బహూకరింపఁబడినది. యువరాజ ప్రస్తావము మాత్రము ఎక్కడను చేయ వీలులేదని సచివులు కట్టడి చేసినారు. చిన్నప్రభువు అంతఃపురములో పెరుగుచున్నాఁడను మాటతప్ప మఱొకటి చెప్ప వీలులేదు! చెప్పినవారికి ఉరిశిక్ష!

అటుతరువాత ధర్మాంగద మహారాజునకు సర్వాంగ సుందరుఁడైన పుత్రుఁడు జన్మించినాఁడని దేశదేశములలో చాటినారు. పండితులకు బ్రాహ్మణులకు సువర్ణదానము లీయఁబడెను. బీదలకు అన్నదానము వస్త్రదానము జరిగెను.

ప్రజలనుదర్శించకయే ధర్మాంగద మహారాజు సుతుఁడు షోడశ వర్షప్రాయుఁడైనాఁడు.

రాజదంపతులు తమ యేకైక సంతానమును గాంచి కడుపు చెఱువగునట్లు విలపించని దినములేదు!

యువరాజు ప్రాయమెఱిగి వివాహార్హలైన సౌందర్యవతుల చిత్తరువులు ఒండొంటిని మించిన యందచందములు గలవి రాజకుమారుని నిమిత్తము రాఁదొడగినవి. ఆ చిత్రపట

ములు తిలకించినరాజు నీరవుఁడై అంతఃపురమునకు మఱలి నాఁడు. పుత్రుని రూపమును దలఁచుకొని ఆ ప్రభువు పడిన దుఃఖమునకు మేరలు లేకపోయినవి.

అద్భుతమైన మేధాసంపత్తిగల సచివుఁడు ప్రభువునకు మనోబలము నిచ్చినాఁడు. ధైర్యమును గఱపినాఁడు. "ఇంత కాలము మన యువరాజు జగన్మోహనుఁడైన మానవుఁడని చాటి, కడకు వివాహ సమయమున వెనుకడుగు వేసినట్లయిన ప్రభువుల కపకీర్తి" యని వెఱపు కలుగఁ జేసినాఁడు. సాటి రాజులలో ధర్మాంగదుని ప్రతిష్ఠకు తీఱని కళంకము కలుగఁ గలదని నమ్మించినాఁడు.

వెంటనే పురోహితులను పిలపించి చక్కని సాముద్రిక లక్షణములును, సలక్షణమైన పంచమ సప్తమ భావములును కలిగిన జాతకురాలిని, సత్సంప్రదాయముగల జగదేకసుంద రిని, దేశ దేశములు చూచిరమ్మని నానా దేశములకు పంపి నాఁడు. యువరాజప్రశంస కడుజాగ్రత్తగాఁ జేయవలెనని బోధించి పంపినాఁడు.

అంగ వంగ కళింగ బంగాళ నేపాళ మళయాళాది దేశ ములలో సంచారము గావించిన బ్రాహ్మణోత్తములు మంత్రి కోరిన శుభలక్షణ సంజాత నెక్కడను గానక, అసంతృప్త హృదయములతో తమ పట్టణమునకు మఱలిపోవు సమయ మున వారి కొక శుభవార్త తెలియవచ్చినది.

సౌరాష్ట్ర దేశములో మాణిక్యపుర మేలు రత్నాంగద మహారాజునకు సుందరియను కుమార్తె అసాధారణ లావణ్య

వతి కలదని తెలిసినది. ఆ దేశము వెళ్లి, ఆ ప్రభువునకు తమ రాకను తెలియఁజేసినారు.

బ్రాహ్మణోత్తములు తెలిపిన వృత్తాంతమువిని రత్నాంగదమహారాజు అపరిమితానందమును పొందినాఁడు. 'తన పుత్రిక శుభలక్షణ సంపన్న-అందాలదొంతర! ఆ బాలికకు తగినవరుఁడు భూలోకములో ఏమూలనైన జన్మించెనా?' అను సంశయములో నున్నాఁడుతాను. ఆ స్థితిలో-పెద్దరాజులతో వియ్యము తనకు-అనన్యసామాన్య సుందరరూపుఁడు యశోరాజ్యలక్ష్ములతో తనగారాబు తనయకు లభించఁబోవు చున్నాఁడు! ఈ అపురూపమైన సంబంధము తనంతటతానే తమను వెదుకు కొనుచు ఎదురుగా వచ్చినది.! ఇఁక నతఁడు కోరఁదగిన దేమున్నది?

రాజకుమారిని కైసేసి తీసికొని రమ్మని దాసీజనము నంతఃపురములోనికి పంపినాఁడు. నిండుచంద్రుని బోలిన బాలామణి, సర్వాభరణ భూషితయై-కాలియందెలు ఘల్లుమనగా-హంసనడకలతో వచ్చి, జనకుని సమీపమున నాసీనురాలయినది. ఆ విద్యుల్లతా సుందరిని వీక్షించిన బ్రాహ్మణోత్తముల కన్నులు మిఱుమిట్లు గొలిపినవి. 'ఈ రాచబిడ్డలకు వివాహము కుదిరినట్లయిన రతీమన్మథులతో సరితూఁగగఁల'రని భావించినారు. ఆ బాలిక హస్తరేఖలను తిలకించి-జాతకమును పరిశీలించి తమ యామోదమును తెలిపినారు.

రత్నాంగద మహారాజు సంతోషముతో ధర్మాంగద మహారాజు తనయునిఁ జూచి రావలసినదిగా తమ పురోహి

తులను, వచ్చిన బ్రాహ్మణోత్తములవెంట కాశ్మీర దేశము పంపినాఁడు.

సౌరాష్ట్ర దేశపు వార్తల నాలకించి ధర్మాంగద ప్రభువునకు ముచ్చెమటలు పోసినవి. దేహము గడగడ వడఁకినది. వెంటనే మంత్రిపుంగవునకు చెప్పి పంపినాఁడు. "ప్రభూ, ఈ దేహము, దీనిలోని రక్తమాంసములు మీవి. బుద్ధిబలము భుజబలము వినియోగపఱిచి, రాజవంశపు కీర్తిప్రతిష్ఠలను నిలుపు నవకాశము నాకు ప్రసాదింపుఁడు" అని మంత్రి చేతులుజోడించినాఁడు. ప్రభువు కార్యభారమంతయు మంత్రిపై నివైచి-తాను దైవచింతనములో మునిఁగిపోయినాఁడు.

వీర పురుషోచితగాంభీర్యము, రాచఠీవి,సుందరరూపము గల తన కుమారునకు రాచవలువలు తొడిగించి-రత్నాంగద మహారాజుగారి బ్రాహ్మణులకు మంత్రి శేఖరుఁడు చూపించినాఁడు.

"విలువిద్యలోగాని సంగీతసాహిత్యములలోగాని-ఈ రాచబిడ్డను పరీక్షింపుఁడు. కాసంత కొఱఁత కలిగినను, మా యువరాజునకు మీ మగువ నీయకుఁడు" అని మంత్రి ధీరవచనములాడినాఁడు.

రాజకుమారుని పరీక్షించి సంతృప్తులైన భూసురులు వారి రాజ్యముచేరి, రత్నాంగదరాజును దర్శించి, వరుని యోగ్యతను చిత్రవిచిత్రములుగా వర్ణించి మంత్రిపుంగవుఁడు పెట్టిన నియమములను నివేదించినారు.

"మా రాజ వంశపు మర్యాద వినుడు
విశ్వంబులోలేని వింతను గనుడు
అత్యంత సుకుమారుడౌ రాజసుతుడు
పట్టణంబు వెడలి పరదేశమునకు
తరలింపగా రాజు తగనీయకొనడు
వారి వంశపురీతి వేరుగానుండు
తమచేతికత్తికి తగుభూషికమ్ము
గట్టి కానుకలెల్ల వెట్టి తర్లించి
కత్తికిని కాంతకును గడు తలంబ్రాలు
పోయించి తగపెండ్లి చేయించి యుండు"

వరుడు స్వయముగా మంగళసూత్రము కట్టకతనకు మాఱుగా కత్తిని పంపు నన్నవార్త రాజును కొంచెము కించ పఱచినది-గాని యోగ్యమైన సంబంధము చేయిదాటి పోఁగ లదను నుద్దేశముతో మంత్రిపెట్టిన నియమముల న్నిటికిని తలయొగ్గి, వివాహమునకు తగుసన్నాహము చేయించినాఁడు. శుభలగ్నమును నిర్ణయించి పత్రికలను ధర్మాంగదమహారాజు నకు, తన బంధుజాలమునకు పంపినాఁడు.

సుందరి వివాహమునకు పురమంతయు అలంకరించినారు. సామంతరాజులు, బంధువులు విడిదిండ్లలో విడిసినారు. లగ్నపు ఘడియలు సమీపించినవి. పురస్త్రీలం పెండ్లికుమారుని చూడ వలెనన్న కుతూహలముకొలఁది రాజప్రాసాదము లోపలికివెళ్ళి కంకణముకట్టిన కత్తిని మాత్రము తరలించుకొనివచ్చిన మంత్రిపుంగవు నొక్కనినిజూచి నివ్వెఱపోయినారు.

పెండ్లికి పెండ్లికొడుకు లేడు-పెండ్లివారును లేరు! పుర వధూటులందరును ముక్కుమీద వ్రేలిడుకొన్నారు. రాజ

కుటుంబ విషయము గనుక వారిలో వారే మాటపైకి పొక్క కుండ గుసగుస లాడుకొన్నారు.

మకర తోరణముల మధ్య రత్నాల వేదిక సమర్చినారు. పసిఁడి పీటలమీఁద బాసికము కట్టిన కత్తికెదురుగా సుంద రిని కూర్చుండఁబెట్టి ముత్యాల తలంబ్రాలు పోయించినారు. సప్తపదులు త్రొక్కించినారు. ఐదువతనమునకు మింటనున్న అరుంధతీ దర్శనము చేయించినారు.

వివాహము అతివైభవముగా జరిగినది.

గుఱ్ఱాలతో, ఏనుగులతో-కోట్లకొలది మూటల దీనా రాల అరణముతో, దాసదాసీ జనము వెంటరాగా రాచ మర్యాద ననుసరించి సుందరి అత్తవారింటికి పయనమైనది.

గారాబుపట్టి తమను వీడి అత్తవారింటికి వెళ్లుచున్నదని రత్నాంగద రాజదంపతులు కన్నీరు గార్చినారు, స్త్రీలు తలి దండ్రులను వీడి అత్తవారింట కాఁపురము చేయుటయే విధియని తెలిసినను దుఃఖమాగలేదు. వయసున చిన్నదియయి నను మట్టుమర్యాదలతో ప్రవర్తించి తమ పుత్రిక తమకు పేరు తీసుకొనిరావలసి యున్నది. తల్లి కుమార్తెను చేర దీసుకొని—

"అత్తమామల మాట అడిదాటరాదు
పొరుగిండ్ల కెన్నడు పోరాదుసుమ్మి!
మరదులు బావలు పరిహసింపగను
చిన్నబోరాదమ్మ చిన్నారిచిలుక!
పరులతో పలుమారు భాషింపరాదు

కుంటైన గ్రుడ్డైన గూని వాడైన
అంధుడే అతడైన అతిరోగి యైన
పేదవాడైనను జూదరి యైన
ఈశ్వరుం డతడుగా ఇంతి సేవించు
పెనిమిటే ఒకదైవమని చూడవమ్మ
మాకు నపకీర్తిని మరితేకు మమ్మ
మాకు కీర్తులు తెమ్మ మాచిన్న చిలుక!
సొంపుగా త్రైలోక్య సుందరను పేరు
లోక వాడుకనుమ్మ లోలాక్షినీకు
పుట్టిల్లు గాదమ్మ పొలతుల కవని
అత్తిల్లు నిత్యంబు అబలల కెపుడు"

అని అంగలార్చినది. రత్నాంగద మహారాజు మంత్రిని పిలిచి తన హృదయబాధ నంతయు వెళ్లబోసుకొని "అత్త మామలకు పెనిమిటికినాతనయను ఒప్పగించవలెననుకొన్నాను. వారందరికి మారుగా నీవొక్కడవే వచ్చినావు.

"ఓమంత్రిపుంగవా ఓగుణధీర
నీమాట నమ్మి మానెరత నిచ్చితిమి
మీరాజు మీఅయ్య మీపెండ్లికొడుకు
మేముచూడగలేదు మీమహత్వముల
అదిగాక సుందరి నప్పగించితిమి
ఇందాక మాపట్టి ఇపుడు మీపట్టి
మనరాజుగారితో మనవి చెప్పండి
ముద్దరా లగుబాల బుద్ధు తెమెరుగు
కనుక ఏలాగైన గడుపుకొం డనుచు"

కన్నీళ్లతో తమ బాలను అప్పగించినాడు, పెద్దలకు నమస్కరించి - తోటి చెలుల యొద్ద సెలవు తీసుకొని, కన్న వారి మీద మమకారమును వీడలేక చిన్నబోయిన ముఖముతో, స్త్రీ విధ్యుక్త ధర్మముగా సుందరి అత్తవారింటికి వెళ్ళినది.

అత్తమామలు కోడలిని ఆదరముతో సౌధోపరిభాగము లోనికి తీసుకొనివెళ్ళి అంతఃపుర ప్రవేశము చేయించినారు.

రాజకుమారుని ఎన్నడునుచూచిఎఱుఁగనిపుర స్త్రీలు, అత్యంత సుందరియైన అతని వధువునుచూచి అబ్బురపడినారు.

కన్నవారు చెప్పిన మర్యాద మార్గములతో, రాజ వంశపు కట్టడులతో వినయశీలయయిన సుందరి కొన్ని సంవత్సరములు ఒంటరిగా గడపినది.

అనన్యరూపలావణ్య రేఖలతో తీర్చి దిద్దఁబడిన సుందరి పసిడికాంతులను వెదజల్లు ప్రౌఢ యయినది. ఆమెహృదయము రతీదేవి హృదయమై వలపు వాసనలను విరజిమ్మ నారంభించినది. ఆమె స్వప్నములన్నియు మధురాతి మధురములే. ఆజాను బాహుఁడయిన సుందరాకారుఁడు ఆమె స్వప్నవీథులలో తిరుగాడఁజొచ్చినాఁడు, నవనవోన్మేషమైన ఆబాలిక మానసము తన హృదయాలయములోని ప్రణయమూర్తిని కనులార దర్శించవలెనని ఉబలాటపడ నారంభించినది.

అపుడామె స్నిగ్ధ హృదయములో ఆపుకోలేని ప్రశ్న పరంపర యుద్భవించినది.

"అప్పటికామె అత్తవారింటికి వచ్చి కొన్ని సంవత్సరములయిపోయినవిగదా!

వివాహమాడి-తనను శ్వశురగృహమునకు తీసుకొని వచ్చినది ఏవీరుని ఖడ్గము?

ఆ ఖడ్గధారి రాజాంతఃపురములలో ఎక్కడను కనఁబడఁడేమి?

యువరాజుప్రశంస అత్తమామలు ఏనాఁడునుఎత్తరేమి?

దాసదాసీజనము చిన్న ప్రభువును ఏనాఁడును కొలువరేమి?

ఈ ఆలోచనలు ఆమెను అహోరాత్రములు వేధించ నారంభించినవి. తన ప్రశ్నలకు సమాధానము లెవరినడిగి తెలిసికొన వలెనో తెలియక కొంతకాలము ఆబాలిక నిగ్రహించినది. తుద కొకనాఁడు ముసలిదాసి నొకదానిని రహస్యముగా పిలిచి, తన హృదయాంతరాళములో చెలరేఁగు చున్న కల్లోలమును ఏకాంతముగా బయటఁబెట్టినది.

ఆ ప్రశ్న పరంపరకు దాసి భయకంపితురాలయినది. బిత్తరి చూపులతో గడగడ వడఁకుచు ఎటుప్రక్కనుండి యెవరు వచ్చి తనను దండింతురోయని భీతిల్లిపోయినది.

సుందరికి ఆదాసి చిత్తసంక్షోభము అర్థము కాలేదు. "చెప్పు.........మీ యువరా జెక్కడ నున్నాఁడు? విదేశ యాత్రలకు వెళ్ళినాఁడా? ......ఏప్రాంతములకయిన రాజు చేతపంపఁబడినాఁడా?" అని యాతురతతో ప్రశ్నించినది. నోట మాటలేని దాసి అన్నిటికిని తల అడ్డముగా త్రిప్పినది.

శ్వాసను నిరోధించి, జేవురించిన ముఖముతో "అయితే ఈలోకములో లేడా?" అని మేఘమువలె సుందరి గర్జించినది.

ఆ యొత్తిడి తాళలేక—ఆరాజ్యములోని భయంకర నిగూఢ రహస్యమును వృద్ధదాసి రాజకుమార్తె చెవిలో నూది వేసినది.

పిడుగువలె ఆ వృత్తాంతము సుందరిని నిలువెల్ల దగ్ధము చేసివేసినది. తత్తరపాటుతో—కంపిత హృదయముతో —రాచ మర్యాదలనువిడిచి, అత్తగారి సన్నిధికి పాదచారిణియై వెళ్ళినది.

ఒంటరిగా పాదచారిణియై వచ్చిన కోడలిని చూచి రాణి అర్మిలీ దేవి నిర్ఘాంతపోయినది.

"న్యాయశాస్త్రరీత్యా మీరు నాకు మాతృసమానులు. నా హృదయ సంక్షోభమును మీకెఱిగించుకొనవచ్చునా?" అని అత్తగారి పాదములపైన వ్రాలిపోయినది సుందరి.

నురుగులు గ్రక్కుచు పరుగెత్తుకొని వచ్చిన కోడలు 'తన నెందుల కట్లు ప్రార్థించుచున్నదో'యని అనుమానించిన రాణి హృదయము బీటువారినది. పైకి ఉబుకుకొని వచ్చు చున్న దుఃఖము నణచుకొనుచు "ఏమి తల్లీ! ఒంటరిగా వచ్చినావు?" అని కోడలిని అక్కునఁ జేర్చుకొన్నది.

దాసి మాటలవలనఁ గలిగిన భావోద్రేకము నణచు కొని "అత్తా! మీ అనుంగు కుమారుని దర్శనము నాకు చేయించరూ?" అని సుందరి దైన్యముతో వేడుకొన్నది.

సుందరి కోరిక అర్చిలీదేవి హృదయమును నిశిత శరమువలె వేధించఁగా ఆయమ మూర్ఛపోయినది. కొంత తడవైన తరువాత చెదరిన హృదయమును చేరదీసుకొని కోడలిని అక్కున చేర్చుకొన్నది.

"నాపూర్వ పుణ్యంబు నాభాగ్యమేమొ
విశ్వంబులోలేని వింతయే జరిగె
నాగర్భమున బుట్టె నాగరా జౌర!
పుట్టగానే మంత్రి పుడమి లోపలను
పుత్రుడేయని వేగ పురిని చాటించె
మటుమాయ గల్పించె మంత్రి పుంగవుడు
కత్తినే చూపించి కాంత నిందెచ్చె
ఏమందునే తల్లి ఇకజూడు మనుచు
మూలనుండిన పెట్టె ముందట బెట్టి
కండ్లనీ రొలకంగ కాంత దాబలికె
పడతిరో! నీవిభుడు ఫణిరాజు చూడు"
మనుచు సుందరి మోల ననని పై డించె
పెట్టె మూతను దీసి ఇట్టటు కదుప
ఫణిరాజు బుస్సున పడగెత్తి లేచె

బుట్టలోని నాగరాజును చూడఁగానే సుందరి చిత్తరువు లోని బొమ్మవలెనే నిలచిపోయినది. దుఃఖతరంగములు పొంగినవి. ఆమె మొదలు నఱికిన వృక్షమువలె పడిపోయినది. ఆమె దేహములోని రక్తప్రసారము, నాడీసంచలనము ఒకింత సేపు నిలిచిపోయినవి!

అయిదు నిమిషములలో ఈవార్త కొలువు కూటములో నున్న ధర్మాంగద మహారాజునకు అంచెల మీఁద చేరినది.

నిలువబడిన పాటున తత్పరపాటుతో పాదచారియై బయలు దేఱి అంతఃపురము ప్రవేశించినాఁడు.

అప్పటికి సుందరిలేచి విస్ఫారితనయనములతో నాగ రాజును తిలకించినది. హృదయములో రగులుకొన్న కార్చిచ్చు తెరలు తెరలుగా బాధించ నారంభించినది.

"అత్తరో మాయత్త అర్మిలీదేవి!
నీపేరు జగతిలో నెగడు విఖ్యాతి
నీవంటి పాపిష్ఠి నేనెందుగాన
పాముకై నన్నిట్లు పట్టి తెచ్చితివి?
నీ యొద్ద నున్నట్టి నెలతలకైన
కనికరమేలేదు కఠినాత్మురాల
ధర్మాంగదుండైన తగదన కిట్లు
పాపిష్ఠి చేతకు పాల్పడెనమ్మ!
పూర్వజన్మమునందు పాలతి మీ రిట్లు
ఈలాటి కార్యము లెన్ని చేసితిరొ!
ఆ పాప ఫలమిది, అది మిమ్ము విడక
ఈ జన్మమున మీకు నిట్లుగా పండె
నరుని గర్భమునందు నాతి యీవరకు
ఈ వింత లేదెచట వింతైనగాని
చెప్పుడు కథలైన చెప్పగా వినము
పొడుపు కథలుగాని పొడచూపలేదు
నాల్గు యుగములందు నడవళ్ళు విన్న
ఈరీతి లేదుగా ఎందైనగాని
బుధులు పండితులైన భువి నింతవరకు
ఈ వింత చెప్పుట ఎప్పుడును లేదు
ఏజాతి గర్భాన ఆజాతి బుట్టు
ఇతర జంతువు బుట్టు టిలలోన లేదు
ఈనాడు ఈవింత ఈభూమి జరిగె

ఎంత పాపిష్ఠులో ఈజగమందు
నా యుసు ర్మీవెంట నాతిరో వరలు
పదునాల్గు జన్మాల పట్టి జరుగును
ఇది ఘోరపాపంబు ఇది తగదనుచు
పురమున ఒకరైన పౌలతి చెప్పరకె?
ఇటు కఠినాత్ములు ఈ భూమి నుండ
కనకాపురంబంచు కలిగె పేరెట్లు
పట్నంబులోనున్న ప్రజకొక్క బుద్ధె
పట్టి వ్రాసిన యట్టి బ్రహ్మ ననవలెను
పంచమహాపాప పట్న మనంగ
ఈ పట్నమేగాని ఇకవేరె కలదె?
పాముకు మనిషికి పరిణయ మిలను
తగదని ఎవరును తప్పింపరైరి !
భేరీ మృదంగాలు ఘోరుమనంగ
తగిన రాణువతోడ తరలి వచ్చితిరి
పట్టపగలె మీరు పట్టి కత్తికిని
పరిణయము చేసితిరి ప్రజ్ఞ మీరగను
పుడమిలోపల నన్ను పుట్టించు బ్రహ్మ
ఇల నాథు సౌఖ్యంబు లిపు డీయరాదె?
పతిలేని ఇటువంటి పడతి యౌవనము
పాడింటి దీపంబు పగిదిగానుండు
విభుని సౌఖ్యము లేని వెలది యందంబు
అడవిగాచిన వెన్నెలట్లౌను గాదె
నాముద్దు ముచ్చటల్ నాతి మావారు
చూడగా మిక్కిలి వేడుకైయుంద్రు
అల్లుని కూతుని అటుమంచి గడియ
తీసుక పోవగా నాశతో నుంద్రు
నావాండ్ర యాశలు నాయాశలన్ని
బూడిద పన్నీరు పోసినట్లాయె”

ఈ విధముగా కఠినోక్తులాడుట వలన కొంతసేపటి కామెకు కలిగిన భావోద్వేగములోని పొంగు తగ్గినది. 'జరిగిన దేదో కర్మవశాత్తు జరిగిపోయినది. విభుఁడయిన నాగరాజును తీసుకొని పుణ్యక్షేత్రములన్నియు తిరిగి వత్తును. ఏ దేవుని మహిమ వల్లనైన మానుషరూపము రాఁగలదేమో ప్రయత్నించి చూచెదను. నాయదృష్ట మేలాగున నున్నదో ఆవిధముగా కాఁగలదని నాగరాజుతోఁ గూడ తన పయనమునకు అత్తగారి యనుజ్ఞను సుందరి వేడుకొన్నది. అర్మిలీదేవి పాదములమీఁద వ్రాలి కోడలు వేడుకొనుచున్న సమయములో ధర్మాంగద మహారాజు వచ్చినాఁడు. కోడలి దుఃఖమున కతని రక్తము నీరై పోయినది. ఆమెను అనేకవిధములనోదార్చి పయనము మానవలసినదని బోధించినాఁడు. లాభములేదని నిరుత్సాహపఱచినాఁడు. పెద్దల మాటలను మీఱరాదని స్త్రీ ధర్మముల నేకరువు పెట్టినాఁడు. సుందరి తన పట్టును వీడలేదు.

"ఈ పేరు మీఁద శేషుని ఏ పుట్టలోనో విడచి, నీవు దేశద్రిమ్మరివి కాఁదలచితివా?" అని ధర్మాంగద మహారాజు కడకు నిష్ఠురమాడినాఁడు.

"ప్రపంచములోఁగల మహిమలన్నియు చూచివత్తును. ఈ విధముగా నయిన నామనసున కూరట కలుగనిండు. నాగరాజుతో తీర్థయాత్రలు సేవించుట వలన ఏమైన లాభము కలుగవచ్చునేమో? నన్ను వెళ్లనిండు" అని సుందరి అత్తమామలను దైన్యముతో ప్రార్థించి, అనుమతిని బడసినది.

నాగరాజును బుట్టలో నమర్చుకొని, తలపై ధరించి సుందరి రాజప్రాసాదమును దాటినది.

సర్వాలంకార భూషితయై-నవ్యనవనీత సమానమైన నిండు మనంబుతో - మధుర భావనతో - అపరూప సుందరు డని పేరుమోసిన భర్తతోడి సమాగమమునకై గతదినము వఱకును ఎదురుచూచి, అతనితోఁగూడ చంద్రశాలలో విహా రములుసలుప నభిలషించిన తరుణి - నేఁడు పట్టుదుకూలము లను విసర్జించి కాషాయాంబరములను ధరించినది-రత్నాభర ణములను ముత్యాల హారములను తీసివైచి రుద్రాక్షమాలలు ధరించినది! సర్వతీర్థ సంసేవనము వలన శేషుని రూపము మాఱఁగలదను కొండంత యాశతో బయలుదేఱిన రాజ కుమారిని జూచి ప్రజలందఱును జాలిపడసాగినారు. యావ ద్రాజ్య పట్టాభిషేక మహూర్తమునకై ఆయత్తపడుచున్న రామచంద్రమూర్తి కైకేయి వరముల వృత్తాంతమును విని చీనిచీనాంబరములను విసర్జించి, నారచీరలు ధరించి సీతమ్మతో దండకారణ్యమునకుఁ బయనమయిననాఁటి అయోధ్యాపుర వాసుల దుఃఖముకంటె కనకాపురవాసుల దుఃఖము మీఱి పోయినది. దృఢసంకల్పయైన యువరాజ్ఞిని శుభాశీస్సులతో సాగనంపినారు.

సుందరి యత్తమామల హృదయములు ఛిన్నాభిన్నము లయినవి. కోడలాడిన మాటలలో ఒక్కటిగూడ సంప్రదాయ విరుద్ధముగ కనఁబడలేదు. ఈశ్వర సాక్షాత్కారము కొఱకు కఠినములయిన నియమములతో తపస్సమాధికేఁగ స్థిరసంకల్ప యైన గిరిజామాత వలెనే సుందరి వారి కంటికిఁ గనుపట్టినది. 'సంకల్ప సిద్ధియై-ఫలించిన ఆశాలతతో ఆమె తిరిగి పురప్రవే

శము చేయఁగలదేమో' యని ఆశించి, ప్రజలతోపాటు తాము గూడ ఆమెను దీవించి సాగనంపినారు.

ఏకాగ్రచిత్తముతో - పాదచారిణియై - ఆకలి దప్పులను నిగ్రహించి - కనఁబడిన రాతికి మ్రొక్కుచు-ఎదురైన పుణ్యనదిలో స్నానమాడుచు, దర్శనమొసఁగిన మహాత్ముల దీవనలను పొందుచు, ఫణిరాజుతో సుందరి దివ్యక్షేత్రములన్నియు తిరిగినది. కాని ఆమె కోరిక సఫలము కాలేదు.

తిరిగి తిరిగి సుందరి దేహము కృశించి సౌందర్యమువన్నె తఱిగిపోయినది-కేశములు జడలు కట్టినవి - నేత్రాంతములు నల్లఁబడినవి - కాని ఆమె స్థిరచిత్తము కొంచెమైన సడలలేదు.

ధూళిధూసరములైన వస్త్రములతో - తడఁబడు పాదములతో సుందరి నైమిశారణ్యము ప్రవేశించినది. వటవృక్షచ్ఛాయలో నాసీనులయిన ఋషులను జూడఁగనే సంకల్పసిద్ధియగునని యామె మనసులో ఎవరో ప్రబోధించినట్లయినది. గంపెడాసతో వారిని సమీపించి, నాగరాజును వారికి చూపి, మానుషరూపునిఁ జేయవలసినదని దైన్యముతో వేడుకొన్నది.

నాగుపామును వివాహమాడిన సుందరినిచూచి ఋషులాశ్చర్యపడినారు. ఆమె చరిత్రను విని జాలిపడి, ఒకదినమాశ్రయమిచ్చినారు. అంతవఱకు ఆమెపడిన శ్రమను-తిరిగిన ప్రదేశములను ఆమెనోటవిని-ఆబాల మనస్థైర్యమున కక్కజపడినారు.

"నీ కోరిక తీర్చవలసినదని మమ్మె వేడుకొనుచు న్నావా తల్లీ! మేము దేవుళ్ళమా - దేవతలమా? మేమును నీవంటి సామాన్యులమేనమ్మా! భార్య పతివ్రతయయినభర్తకు సకల సౌభాగ్యములు కలుగఁగలవని పెద్దల వాక్యము. ధర్మ పురిలో బ్రహ్మగుండమను నదిలో పార్వతీ పరమేశ్వరులు నివాసమేర్పఱచుకొని, భక్తులు కోరిన కోరికలను తీర్చు చున్నారని విన్నాము. అక్కడికి నీపతిని తీసుకొని వెళ్ళి ప్రార్థిం చు"మని ఆమెను దీవించి పంపినారు.

సుందరి వారి యానతి ప్రకారము బ్రహ్మగుండమును సమీపించినది. ఒడ్డునఁజేరి, తలపైనున్న బుట్టనుదించి మూత తెఱచినది. 'తనను మానుషరూపుని జేయవలసినదిగా సకల దేవతలను ప్రార్థించు సుందరిని ఆశ్చర్యముతోను, తన కొఱకు చేయుత్యాగమునకు కృతజ్ఞతా సూచకమైన వీక్షణములతోను చూచుచు ఆమెభక్తిగానమున పాలుగొనుచున్నాఁడో'యను నట్లు పడగవిప్పి శేషుఁడు ఆడనారంభించినాఁడు. మఱి కొంత సేపటికి అతని హృదయములోని యారాటము కాఁబోలు - తళుకు తళుకున మెఱయు నయనములనుండి ప్రజ్వలింప నారం భించినది. అతని మానసికావస్థల నెఱుఁగఁ బ్రయత్నములు సలుపుచున్న సుందరి, అతని రూపమును జూచి కడుపు తఱుగు కొని పోవునట్లు విలపించినది. ఆమె దుఃఖమునకు పంచభూత ములును కంపించి పోయినవి.

నాగరాజును భూరుహములకు, నదులకు, ఒప్పగించి- తాను స్నానమాడుటకు నదిలోనికి దిగఁబోయినది సుందరి.

"పతిసహితముగా నీటమునింగినంగాని నీకోరిక ఫలించ నేర"దని ఆకాశవాణి మేఘగంభీర స్వరమున పలికినది.

నాగరాజుతోడి స్నానమునకు సుందరి సంశయాకుల చిత్తయైనది. "రాజా! నీకన్నవారి దగ్గఱనుండి నిన్ను వేఱు పఱచి తీసుకొని వచ్చినాను. ఎన్నియో శ్రమలకోర్చినాను— నడచిన త్రోవను తిరిగి త్రొక్కలేదు. తిరిగిన ప్రదేశములు తిరిగి దర్శింపలేదు-కాని—నా ఆశాలత ఫలించలేదు! నీకు మాను షరూపము నిప్పించలేక పోయినాను. తుదకు నీవీ గుండము పాలంబడి పోవుదువా?" అని దీనాతి దీనముగా విలపించినది. ఆమె దుఃఖమునకు కొండలు పర్వతములు కరగి—కొనలనుండి జలమును స్రవింప జొచ్చినవి.

సుందరి నాగరాజునకు నమస్కరించి అతని దేహముతో తన గళసీమ నలంకరించుకొన్నది. ఉష్ణగుండములోదిగి, భక్త్యావేశమున ముమ్మాఱు మునింగినది. మూడవసారి నీటిలో నుండి తలయెత్తగానే నవమన్మథమూర్తియయిన సుందరుడు గళమున కృష్ణపాదములు మెఱయ సుందరి కట్టెదుట ప్రత్యక్ష మయినాడు!

ఆశ్చర్యముతో సుందరి కన్నులను నులుముకొనుచు, తన కంఠమునకు పెనవైచుకొనిపోయిన నాగరాజు కొఱకు తడవిచూచినది. గళముననున్న మంగళసూత్రము మాత్రమే ఆమె చేతికిం దగిలినది. భాస్కరుని కిరణముల కాంతి ప్రస రించి ఆమె పుస్తెలు మిలమిల మెఱయసాగినవి!

తన సాన్నిధ్యములో - బిత్తరిచూపులతో - నిలువబడి పోయిన ఆయువకుని లోకోత్తర సౌందర్యమునకు సుందరి విస్మయమొంది-మునుల దీవనలను స్మరించుకొని-యపరిమితా నందమునొంది నీటిలోనుండి యొడ్డునకుఁ జేరినది.

నూతన వాతావరణము నర్థము చేసికొనలేక-తానెవ్వరైనది ఎఱుఁగక - ఆమె ననుగమించి యొడ్డునకు చేరినాఁడా సుందరమూర్తి.

సుందరి ఆనంద సముద్రపు వైశాల్యము ... నెఱుఁగని తన్మయావస్థలో నిలచిపోయినది. ఆమె మానసము చంద్రోదయము నందలి సముద్రమువలె పొంగి పరవళ్ళుత్రొక్కినది.

'తాను వరుడు - ఆమె తన వధువు' అను పరిజ్ఞాన మా యువకున కిసుమంతయినను లేదు. ఆ స్థితిలో ఆతనికి తన్నెట్లు ఆలింగించుకొనవలెనో యెఱుఁగని సంధిగ్ధమున సుందరి కొట్టుకొని పోవుచున్న సమయములో 'యువతీ! నీ వెవ్వరిదానవు? అని ఆ యువకుఁడు ప్రశ్నించినాఁడు.

సంభాషణ నాతఁడే ప్రారంభించినందులకు సంతోషపడి తమ యిద్దఱి జీవితగాథలను సమగ్రముగా ఏకరువుపెట్టి - గ్రహించుమని సుందరి తన దక్షిణ హస్తమును చాపినది.

అతఁడు విస్మయముతో ఆమెను తిలకింపసాగినాఁడు. ఆమె చెప్పిన విషయములను విన్నతరువాత అతనికి కలిగిన సందేహము లనంతములు. మానవజాతి స్త్రీకి పన్నగముద్భవించుటయు, పుత్రోదయమయినదని మంత్రి ప్రచారము

గావించుటయు, దూర దేశముననున్న రాజు కంటితో చూడ కయే త్రిలోకసుందరి యయిన తన కుమార్తె నిచ్చి-అత్యంత వైభవముతో వివాహము చేయుటయు, భర్త నెఱుఁగకయే అతని కొఱకు నిరీక్షించుచు సుందరి అత్తవారింట కాఁపురము చేయుటయు, తుద కొకనాఁడు వారిని ప్రశ్నించి-అభయంకర రహస్యమును దెలసికొని-భుజంగముతో తీర్థయాత్రలను సేవించుటయు, 'నాగుపామును ఎప్పటికయిన మానుషరూపునిగా చేయఁగల'నన్న ఆత్మవిశ్వాసమా బాలికకుఁ గలుగుటయు, ఆహారపానీయములను విసర్జించి దీక్షతో-ఏకాగ్ర చిత్తముతో తిరిగి తిరిగి కడకు జయమొందుటయు, మొదలైన విషయము లన్నియు కట్టుకథలలోని యంశముల వలెనే అతనికిఁ దోఁచినవి. పామును చూడఁగనే పదిబారల దూరమున నిలచు మానవులు-పాలుబోసి భుజంగము నెట్లు పెంచినారు? తన కుమారునిఁ జూపించి భుజంగముతో సుందరికి వివాహము గావించిన మంత్రిసత్తముని యుద్దేశ్య మేమయియుండును? ఈ బాలిక భయము విడచి పామును శిరసున ధరించి యిన్ని ప్రదేశము లెట్లు తిరుగఁగలిగినది? అతనిమానసములో ఉద్భవించిన ప్రశ్నపరంపరకు ప్రత్యుత్తరమొసఁగి, అతనికి విశ్వాసము కలిగించఁగలిగినవారు అక్కడ నెవరును లేకపోయినారు.

సుందరిస్థితి అయోమయమై పోయినది. "ఇంతకాలము తిరిగి తిరిగి-అష్టకష్టములుపడి-తుదకు తనకోరికలు ఫలించిన వనుకొనుచుండఁగా-క్రొత్త సమస్య లెదురైన వేమి?తనవృత్తాంతము సత్యమని సాక్ష్యమీయఁగలిగిన వారెవ్వరు?" ఆమె మొ

దటినుండియు దైవమునే నమ్మి జయమును చేపట్టినది-కనుక ఆదైవమునే ప్రార్థించినది.

ఆసాధుశీల ప్రార్థనలను సర్వేశ్వరుఁడు నిజముగానే ఆలకించినాఁడు. మేఘగంభీర భాషణములతో సుందరి కథనము నాకాశవాణి వినిపించినది. పరస్పరసంభ్రమావలోకనముల లో యువతీ యువకులు మగ్నులైనారు. వీక్షణము లొండొరు లను పలుకరించుకొన్నవి-రసవంతములైన అనేకోదంతములు తెలుపు కున్నవి-ఉరడించుకొన్నవి- లాలించుకొన్నవి- కడకు సాయుజ్యము నందినవి!

వారి హృదయములు రాగరంజితములయినవి! వారి ద్దఱు రత్నాంగద మహారాజు నొద్దకు వెళ్ళి-సుందరి పరిణయమై అత్తవారింటికి వెళ్లినదాదిగా అప్పటి వరకు జరిగిన విషాదోదం తమును తెలిపినారు. వియ్యంకుఁడు చేసిన మోసమునకు రత్నాం గదమహారాజు ఆగ్రహోదగ్రుఁడై యుద్ధమునకు తలపడినాఁడు. కాని కుమార్తెచే వారింపఁబడి, శుభాంతమయిన సుందరిచరిత్ర కానందమునొంది ధర్మాంగదమహారాజును కుటుంబ యుక్త ముగా విచ్చేయవలసినదని యాహ్వానించినాఁడు.

ధర్మాంగద మహారాజు వియ్యంకుని యాహ్వానమునకు కంపించిపోయినాఁడు. కుటుంబ యుక్తముగా విచ్చేయవలసిన దని యాహ్వానించినాఁడే! తనకుమారుఁడని చెప్పి ఏపుట్టలో నుండియైన పామును దెచ్చి నమ్మించవచ్చునుగాని రత్నాంగ దుని తనయ నెక్కడినుండి తీసుకొని రాఁగలఁడు? సుందరి ఎన్ని

చిక్కులు తెచ్చి పెట్టినది? దీనికంతకును మూలము ఆవృద్ధ మంత్రి! మొదటినుండియు మాయమాటలతో కథలల్లుచు తన ను-లోకమును-కడకు ముక్కు పచ్చలారని అమాయకురాలైన సుందరిని మోసము చేసినాఁడు. ఈ ఆహ్వానము విషయములో ధర్మాంగద మహారాజు మంత్రియాలోచనము సరిగ్గా చలేదు. రాణితోఁగూడ వెళ్లి, రత్నాంగదుని పాదములపైఁబడి జరిగిన విషయములను చెప్పివేసి, తగురీతి శిక్షింఁచవలసినదని ప్రార్థించుటకు బయలుదేఱి వెళ్లినాఁడు.

అక్కడ రాజప్రాసాదములో సుందరిచెంత నిలువఁబడిన సుందరాకారునిచూచి విభ్రాంతిపడి- సంశయాకులుఁడై సుందరిదెస అనుమానాస్పదములైన చూడ్కులను బఱపినాఁడు. ఆచూపులకామె గడగడ లాడిపోయినది. ఎవరును నమ్మఁజాలని గాథలవలెనే ఆమె జీవిత ఘట్టములు జరిగిపోవుచున్నవి!

రాణి అర్మిలీదేవి హృదయము ఆయువకుని జూచినదగ్గరనుండి అవ్యక్తానందముతో పొంగనారంభించినది. 'ఈ ఆలేఖ్యతనూవిలాసుఁడు తనగర్భవాసముననే జన్మించినట్లయిన తన యదృష్టమునకు మేర లుండియుండునా?' అని నిట్టూర్పు సాగినది.

ధర్మాంగద రాజదంపతులకు గలిగిన సందియముల నాకాశవాణి తీర్చి-వధూవరుల మీఁద పుష్పాక్షతలు చల్లి దీవించినది.

వధూవరుల తలిదండ్రులు పొందిన ఆనందము అపారము. ఆకాశమంత పందిరి వేయించి-కుమారునకు చిత్రాంగద నామమొసంగి-అత్యంత వైభవముతో సుందరీ చిత్రాంగదుల పరిణయమును పట్టాభిషేకమును చేసినారు.

ఆమె పతివ్రతా మాహాత్మ్యము ప్రపంచము నిలిచినంతవఱకును స్థిరముగా నిలువఁగలదని గౌతమ మహర్షి అహల్యాదేవికి తెలిపి యామెను విస్మయపఱచినాఁడు.



# 4. ధర్మరాజు జూదము

ధర్మరాజొనర్చిన రాజసూయ యాగమునకు కుటుంబ సమేతుఁడై వెడలి, గృహోన్ముఖుఁడైన రారాజు చింతాకుల స్వాంతుఁడై శయ్యాగృహము వీడి బయట కాలిడలేక పోయినాఁడు. ఆతని మానసములో పెద్ద తుపాను చెలరేఁగినది. 'దయాధర్మముగ ధృతరాష్ట్రుఁ డొసగిన అర్ధరాజ్యమును పాండునందను లెంతలో పెంపొందించినారు! నలుదిక్కుల దిగ్విజయము గాంచిన కౌంతేయుల యశస్సు శీఘ్రగతిని దశదిశల వ్యాపించి పోయినదే! రత్నరజత సువర్ణమయమైన అక్షయ నిధులు పాండుసుతులకు ప్రత్యక్షమైనట్లే యున్నవి. లేకున్న బొక్కసములన్నియు అనతికాలములోనే సందులేక క్రిక్కిఱిసి యుండఁగలవా? ఆ సభలో-ఎక్కడఁ జూచినను – ఎవరినోట విన్నను దేవతర్పణములతోను, యథోచిత దక్షిణలతోను, అభీష్టదానములతోను, మహీదేవ తర్పణములతోను రాజసూయ యాగంబుచేసి – నానారాజపూజితుండైన యుధిష్ఠిరుఁడు ధన్యుఁడైనాఁడను పలుకులే మాఱుమ్రోగినవి. ఆపలుకులన్నియు ములుకులై రారాజును బాధింపఁజొచ్చినవి. మయసభావైభవము రమణీయతరమై–మనోజ్ఞమై–తనను విస్మయపఱచినది! ఆ సభావిశేషము లన్నియు అపూర్వములే. జలాశయములు భూప్రదేశములుగను, భూప్రదేశములు జలాశయములుగను కన్పడునట్టి వైచిత్ర్యము లాసభా భవనములో ఇముడ్చ బడినవి, రారాజంతటివాఁడు భ్రమప్రమాదములకు లోనై కట్టుపుట్టములను తడుపు కొనునట్లు చేసివేసినవి. అందును తనకు కలిగిన ప్రమాదమునకంటె పాండునందనులును

పాంచాలియు ఆ సందర్భమున తననుజూచి నవ్వినందులకు దుర్యోధనుని మనసెంతయో చిన్నబోయినది. పాంచాలి నలు దిశలను గెలుచుకొన్న పాండవుల పట్టమహిషియైన పోగాక- నానారాజ మహిషులచే నీరాజనము లిప్పించుకొనుగాక! తాను రారాజు-అందును బావవరుసయైన అతిథి; ప్రమాద వశమున భూప్రదేశమనుకొని జలాశయములో కాలిడి, వస్త్రములను తడుపుకొన్నంత మాత్రమున ద్రౌపది నవ్వి గేలి సేయుట నిజముగా సహింపరానిది! పరిభవానలముచే దహింపఁబడి-కలవరపాటుతో గృహోన్ముఖుఁడైన రారాజు, ఆనాఁటి నుఁడి నిర్వ్యాపారతకులోనై కుంగి కృశించిపో నారంభించినాఁడు. బాల్యమునుండియు, మేనమామయగు శకుని రారాజు నెడ నమితవాత్సల్యములో మెలఁగువాఁడు. మంచమున కంటుకొనిపోయిన మేనల్లుని జూచినత్తోడనే శకునికి దుఃఖము పొఁగి పొరలినది, అతనిని జేరఁదీసికొని విషయము నంతయు సంగ్రహించిన వెనుక 'ఏదైన నుపాయమాలోచించి చెప్పెదను. నీవు నిర్భయముగా నుండు' మని శకుని ధైర్యమొసఁగినాఁడు. ఎంతకును రారాజు నోటివెంట వెలువడునవి రెండే మాటలు- 'గర్వాంధయైన పాంచాలి నెట్లయిన నవమానము పాలుచేయవలెను-లక్ష్మీ సమేతులైన పాండుసుతులను దిగ ద్రొక్కవలెను.'

మంత్రాంగములో శకుని ఆరితేఱిన వ్యక్తి. జూదమను మిషలో రారాజు తనయభీష్టములను సులభముగ నెఱవేర్చుకొనగలఁడనిఉపాయము చెప్పెను. ధృతరాష్ట్రునివద్దనుండిఅనుజ్ఞ పొందుమని శకుని మేనల్లునకు సలహానిచ్చినాఁడు. దుర్యో

ధనుఁడందులకు సంతసించి తండ్రిని జేరి, తనకు జూదమాడసిచ్ఛ కలుఁగుచున్న దనియు ధర్మజునిఁ బిలిపించు మనియు వేడుకొని నాఁడు. ధృతరాష్ట్రుఁడందులకు విదురుని సలహా నర్థించినాఁడు. ధర్మనియతిలో విదురుడు వ్యాసునియంశ కలవాఁడు కనుక జూదము అధర్మమార్గమున కవకాశ మొసగఁగలదనియు, కురుపాండు వంశముల శాంతికిని ఐకమత్యమునకును భంగము వాటిల్లఁగలదనియు తనకుఁగలిగిన సందేహమును సూచించి నాఁడు. పుత్రమోహముచే ధృతరాష్ట్రునకు జూదమాడుటలో నెక్కువ హాని కానరాలేదు. ధర్మబద్ధమైన జూదము నాడుమని కుమారునకు సూక్తులఁగఱపి, చక్కటి ప్రదేశమును జూద మాడుటకై ధృతరాష్ట్రుడు నిర్దేశించి ధర్మజుని కొఱకు విదురుని ఇంద్రప్రస్థమున కంపినాఁడు.

విదురునిఁ జూడఁగనే యుధిష్ఠిరుఁడు మాణిక్యమయమైన సింహాసనమునుండి దిగ్గున లేచి-యెదురేగి-అర్ఘ్యపాద్యంబులొసఁగి, ఆసీనునిఁ జేసిన పిమ్మట వచ్చిన కార్యమేమో సెలవిమ్మని యడిగినాఁడు. జూదమునకై రారాజు వద్దనుండి వచ్చిన ఆహ్వానము నందుకొని, ధర్మజుఁడు తల్లికి వందనమాచరించి హస్తినాపురము వెడలుట కనుమతి నిమ్మని కోరినాఁడు. అనేక కడగండ్లుపడి-అప్పుడప్పుడే కుదుటఁబడుచున్న కుటుంబమును జూదమను నెపముమీఁద పెడదారిని తొక్కించకుమని కుంతీదేవి కుమారుని వారింపఁజూచినది. అంతలో ''జూదములో ఆడని అసత్యము ఉండదు. ధనధాన్యములు రాజ్యములు ఒక త్రుటికాలములో చేతులుమారి అనేక సంక్షోభములకు దారితీయును. అన్నయ్యా! మనకా జూదపు

ప్రసక్తియేల?" అని సహదేవుఁడు ధర్మజుని వారించినాఁడు. "సాటిరాజు వినోదార్థము జూదమాడుట కాహ్వానింపగా మన కేమిలోపమని తిరస్కరింతును?" అని ధర్మజుఁడు హస్తినాపురమేఁగుటకు సకల సన్నాహములను చేసుకొని బయలు దేరినాఁడు.

కొమ్మల గట్టిన గుఱ్ఱా లవన్ని
అవియన్ని నడచెనే హస్తినాపురము
నీర్వోసి పెంచేటి నెలత లవ్వేళ
అందరు నడచిరే హస్తినాపురము
కొమరుగా మేల్జాతి గుఱ్ఱాలనెక్కి
కూరిమి వెలిపట్టు గొడుగులే బట్టి
హస్తాల బిరుదైన ఆయుధాల్ పట్టి

సైన్యము ధర్మజునివెంట నడచినది.

ధర్మజుల రాకను అల్లంత దూరమున రారాజుచూచి ఎదురేఁగి పాదప్రక్షాళనము చేయించి సింహాసనాసీనుని గావించి-పండుటాకుల కప్పురపు విడెమొసఁగి కుశల ప్రశ్నలు వేసినాఁడు.

అంతలో శకుని జూదమునకు వలసిన పరికరముల నమర్చి ధర్మజునికెదుట రారాజును గూర్చుండ నియోగించి పాచికలను మేనల్లుని చేతఁబెట్టెను.

ధర్మజుని రాజ్యమును సకలమణిసువర్ణరజతమయమైన ఆతని ధనాగారమును, అన్నిటికంటెను ధనమదాంధత్వములో మునిగిన ద్రౌపదిని గెలుచుకొన వలెనను ఉత్సాహముతో గుటకలు మ్రింగుచు రారాజు పాచికల నెగద్రోసెను.

మొదటి మూఁడు పందెములలో రారాజు ధనకనకవస్తు వాహనములను ధర్మజుఁడే గెలిచినాఁడు. ఈర్ష్యానలముచే దహింపఁబడుచున్న రారాజు హృదయమునకు ధర్మజుని విజయము అగ్నిలో నాజ్యమును పోసినట్లయినది. దుర్యోధనుఁడు చివాలున సింహాసనము మీఁదినుండి లేచి, శకునిచేతికి పాచికలనిచ్చి తిన్నగ పెద్దమ్మనగరి కేతెంచినాఁడు. జ్యేష్ఠాదేవికి సాష్టాంగ దండప్రణామంబు లాచరించి చేతులు జోడించుకొని వినమ్రుఁడై, ధర్మజునితో జూదమాడఁగా తనకు ఓటమి కలిగినదని వలవల యేడ్చి ఆమెను శరణుజొచ్చినాఁడు.

"ధర్మజునితో జూదమాడవలదని ఎంత చెప్పినను నీవు వినవుకదా! అయినను నాచేతనయినంత వఱకు ప్రయత్నించెదను"అని జ్యేష్ఠాదేవి తన చెల్లెలయిన లక్ష్మీదేవితో సంభాషింపవలెనని ఆమె నగరి కేతెంచినది. పెద్దక్కగారి దర్శనముచే లక్ష్మీదేవికి గుండెజల్లుమన్నది, 'ఎవరి రాజ్యములకు చేటు రానున్నదో-ఏకుటుంబము ఆపదల పాలగునో'యనిఆతల్లి వణఁకి పోయినది. అక్కచెల్లెండ్ర కుశలప్రశ్నలయిన తరువాత, ధర్మజునితో రారాజు జూదమాడుటను జ్యేష్ఠాదేవి చెల్లెలికి వివరించి చెప్పి—

సొగసుగా ధర్మజుల్ జూదమ్ము లాడ
ఓడెనే రారాజు ఒక్కటొక్కటిగ
తన రాజ్యములనోడి తరలె నాకడకు
చేర వచ్చిన వాని చెడగొట్టుటకును
మనసొప్పదే నాకు మహాలక్ష్మి వినుమ

అని రారాజునెడ తనకుగల సానుభూతి వెల్లడించినది. "అదిగాక పాండవులేమైన అన్యాయము నెఱుఁగని వారను కొంటివా?

ఆ బ్రహ్మ విప్రులు నానందమొంద
తగు రాజసూయమ్ము తాఁజేసినాఁడు
వీధి వీధులగట్టి విస్తళ్లు వేయ
ఆ యజ్ఞశాలకు నంత నేబోతి
కూతుళ్లు తానును కుడువ బోవంగ
ఆకులు వేసుక అచట మేముండ
కూతుళ్ల భీముండు కోపించె జూచి
ఆడుదానవు నీవు అది నీతిగాదు"

అనుచు నన్ను పదిమందిలో అవమానపఱచినాఁడు. అక్కడనున్నవా రెవరును భీముని వారింపలేదు. అప్పుడు, అవమానమును భరించుకొనలేక నేను ఆకుటుంబమునకు శాపము పెట్టితిని.

చేటలో నిల పండ్లు నెరపిననాడు
ఆనాడు నినుగొల్తు నని పల్కితనెను
కుంచమ్ము వారగా కొల్చిననాడు
ఆనాడు నినుగొల్తు నని పల్కితనెను
తనరగా అరికాలు తడవని నాడు
ఆనాడు నినుగొల్తు నని పల్కితనెను

ఆనాటిశాపము నాకిప్పుడు జ్ఞప్తికి వచ్చినది. శాపము నకు తరుణము సమీపించినది. కనుక నీవు బయలుదేఱి మొగమోటములేక—

నీవేగి ధర్మజు నేలనుదాచి
రారాజు పొందవే రమణిరో! నీవు

అని మహాలక్ష్మి దేవిని బలవంత పఱచినది. లక్ష్మీ దేవి చంచలచిత్తయైనను ధర్మజుని సుగుణములకు కట్టుబడి పోయినది. యుధిష్ఠిరుఁడన్న సామాన్యుఁడా? సకల జనావళిచే పూజింపఁబడుచున్న లోకోత్తర తేజో ధర్మనిరతుఁడు. అతని కెగ్గు తలపెట్టుట లోకమునకే కీడొంచుట వంటిది.

అలికి వీడిన యట్టి యాగడపలను
తా నెన్నడునుగాని దాటడే రాజు
ఏ ధర్మనందను నెడబాయలేను
దివ్వెలేని గృహము దెసకూడ నెందు
చూడ్కుల బఱపుచు చూడడే రాజు
ఏ ధర్మనందను నెడబాయలేను
ఇంట ముగ్గులు లేక యుంటను జూచి
వడిమీర నాయింట నడవడే రాజు
ఏ ధర్మనందను నెడబాయలేను
నీరాడ లేనింట నిలువడే రాజు
ఏ ధర్మనందను నెడబాయలేను
ఆడిమిగులు జలమాడడే రాజు
ఏ ధర్మనందను నెడబాయలేను
కట్టి వీడిన వల్వ కట్టడే రాజు
ఏ ధర్మనందను నెడబాయలేను
అల సానపై గంధ మలదడే రాజు
ఏ ధర్మనందను నెడబాయలేను
పక్షపాతము సభ పలుకడే రాజు
ఏ ధర్మనందను నెడ బాయలేను
పాళ్ళలో భేదమ్ము పంచడే రాజు
ఏ ధర్మనందను నెడబాయలేను
అయ్యో! మాపులు చూరు దుయ్యడే రాజు

ఏ ధర్మనందను నెడబాయలేను
జంటగా పెండ్లిండ్లు సల్పుడే రాజు
ఏ ధర్మనందను నెడబాయలేను
సంధ్యా చాకలి వీధి సాగడే రాజు
ఏ ధర్మనందను నెడబాయలేను

అటువంటి ధర్మశీలుని నేనెడఁబాయఁగలనా? ఆ సద్గుణ రాశి నన్నుఁబాసి యిడుమలు వడుచుండ నేను చూడఁగలనా? అది నాచే గానిపని-ముమ్మాటికి కానట్టిది. ధర్మనందనుని వీడి రారాజు నభిమానించు మనుచున్నావుగాని దుర్యోధను నంతటి అక్రిమ పురుషుని-అధర్ముని ఎక్కడను గానము.

అలికిన గడపను నటు దాటువాడు
ఆ పాపకర్మ నే నంటగా లేను
నట్టింట చిట్టాక మట్టినవాడు
ఆ పాపకర్మ నేనంటగా లేను
దూలమ్ము లేనిల్లు దూరినవాడు
ఆ పాపకర్మ నే నంటగా లేను
అడమిగులు జల మ్మాడినవాడు
ఆ పాపకర్మ నే నంటగా లేను
కట్టి వీడిన వల్వ కట్టినవాడు
ఆ పాపకర్మ నే నంటగా లేను
పాళ్ళలో భేధమ్ము పంచేటివాడు
ఆ పాపకర్మ నే నంటగా లేను
వాడిపోయిన పూలు వాడేటివాడు
ఆ పాపకర్మ నే నంటగా లేను

అని వగచినది. తన మాట కెదురాడిన చెల్లెలిని చూచి జ్యేష్ఠాదేవి ఆగ్రిహముతో చీత్కారము గావించినది.

వయసులో చిన్నది యయిన మహాలక్ష్మీదేవి అక్కగారి మాటను మన్నించి రారాజు ననుగ్రహించక తప్పినది కాదు. తత్ఫలితముగా రారాజు పందెములను గెలుచుటయు ధర్మజులు ఓడిపోవుటయు సంభవించినది. ధనకనక వస్తువాహనములు ధర్మనందనుని చేతినుండి దాటిపోయినవి. మఱుపందెములో రాజ్యమును, తమ్ములను, తరువాత పాంచాలిని క్రమముగా యుధిష్ఠిరుడు ఓడిపోయెను. రారాజు సంతోషము పట్టజాలక పోయెను.

కురువృద్ధులును, పుత్రశతంబుతో ధృతరాష్ట్రుడును, కర్ణవికర్ణ గౌతమ ద్రోణాశ్వత్థామలు మొదలగు వారును అలంకరించిన ఆ సభలో దుర్యోధనుడు విజయమొందిన మత్తతచే, పలువురు వినుచుండ, పాంచాలిని సభలోనికి తోడి తెమ్మని తన కడగొట్టుతమ్ముని అంతఃపురమునకు పంపినాడు.

అల ధర్మజుల్ గట్టు అంబరాల్ గట్టి
అల ధర్మజుల్ వేయు హారముల్ వేసి
అల ధర్మజుల్ బట్టు అయుధాల్ బట్టి
అల ధర్మరా జెక్కు అశ్వము నెక్కి

రారాజు తమ్ముడు రాజఠీవితో అంతఃపురము ప్రవేశించి పాంచాలియెదుట నిలువబడినాడు. ఆతనినిఁ గాంచిన పాంచాలి వెలవెలఁబోయినది. ద్యూతశాలనుండి దుర్యోధనుడు సోదరునిఁ బంపుటలో ఆమెకెన్ని సంశయములో కలిగినవి. అయినను ఆమె ధీరచిత్తముతో ఆతని కెదురుబోయి 'జూదపు శాలలోని విశేషము లేమయ్యా మఱఁదీ!' అని ప్రశ్నించి లోనికి తీసుకొని వెళ్లినది. విజయసూచకమైన మంద

హాసము ముఖముమీద చిందులాడగా - "మా అన్నగారు గెలచినారు. ధర్మజుండు ఓడిపోయినాండు. నిన్ను నిలువబడిన పాటున సభలోనికి తీసుకొని రావలసినదిగ నన్ను పంపినారు." అని ఒరపైన చేయిడి పలికినాండు.

"నేను వదినెగారినని నాతో వరుసలాడుచున్నావట య్యా! పాండవులుగాని కౌరవులుగాని నన్ను సభలోనికి తీసుకొని రమ్మనంగా ఎప్పుడైన విన్నావా?" అని పాంచాలి మఱందిని మందలించినది.

వచ్చిన వ్యక్తి సేవకుడైన యెడల ఈ పలుకులకు వెను దిరుగువాండే, కాని ఆవచ్చిన యాతండు శకుని మేనల్లుండును రారాజు తమ్ముండును అయిన రాచమొలక. పాంచాలి మాటల కాతండు వెనుకకు తగ్గక-

వదిన గారివి కావు వరుసలు లేవు
నిక్కము పాంచాలి నిన్ను రమ్మనెను

అని రెట్టించిన అధికారముతో పలికినాండు. అతని మనోగతము నెఱింగిన ద్రౌపది "నేను స్నానమాడినంగాని రాజుల యెదుటకు రానువీలులేదు" అనిసాకు చెప్పితప్పుకొన్నది. రారాజు సోదరుండు ఆ మాటతో వెనుకకు తిరిగినాండు.

ఈర్ష్యానలముచే దగ్ధమగుచున్న దుర్యోధనుని మానసము అంతటితో ఊరకుండంగలదా? వయసున పిన్నయైనను తనతో సమాన ప్రతిభగల దుశ్శాసనుని పాంచాలి వద్దకు పంపినాండు. పాంచాలి వెనుకటి వలెనే తనను పిలువ వచ్చిన

వచ్చినది కెదురువచ్చి విశేషము లేమని ప్రశ్నించినది. అతఁడు దుర్యోధనుని యానతిని వినిపించి బయలుదేఱవలసినదిగ ఆమెను త్వరపెట్టినాఁడు. పాంచాలి వెనుకటి మాటలనే చెప్పి తప్పించుకొనఁ జూచినది. దుశ్శాసనునివద్ద ఆమె చెప్పిన సాకులు చెల్లలేదు. "నీవు స్నానమాడు వఱకును నేను నిలచి యుందును"అని ఆమె స్నానమునకు తగిన యేర్పాటులను వేగముగచేసి, స్నానమాడిన పాంచాలిని కొప్పుబట్టి యీడ్చి బలిమితో రథముపై కూర్చుండఁ బెట్టుకొని సభలోనికి తీసి కొని వెళ్ళినాఁడు.

ద్రౌపదిని చూడఁగనే, ఆమె ధరించిన వస్త్రముల నపహరింపుమని రౌద్రావేశముతో దుర్యోధనుఁడు తమ్మున కాజ్ఞయిచ్చినాఁడు.

ద్రౌపది మానసము తల్లడిల్లిపోయినది. 'నలుదిశలను గెలచి, పదుగురు మెచ్చగా, రాజసూయయాగము చేసిన తన పతు లేమయినారు? దుర్యోధనున కింతటి యధికార మెవరొసఁగినారు?

అక్షౌహిణీబల మంతయు గలిగి
ధర్మజు లేమైరి ధరణి లోపలను?
బిరుదు బింకము గల్గు భీముడు లేడె?
అస్త్రాల మేటియౌ నర్జును డేడ?
కవలవా రిద్దరు కానివా రైరొ?

అని వాపోయినది. దీనవదనముతో పాంచాలి సభ నంతయు వెదుకగా తలలు వాల్చిన పాండవు లామె కంటికిఁ గనిపించినారు. అంతలో మదోన్మత్తుఁడైన దుర్యోధనుఁడు

ద్రౌపదికి తన యంకమును చూపి చేసైగ చేసినాఁడు. పాంచాలి ఆఁకలిగొన్న సింగమువలె కన్నుల నిప్పులు కురియగా–

"రహి గాజు మెరసితే రత్నమే యగునొ?
మణి నలుపైనంత మసిబొగ్గె యగునొ?
కాలువ లెన్నైన గంగకు సాటె?
చిరుపాము పడగెత్త శేషుడే యగునొ?
వృక్షమ్ము లెక్కిన పక్షులన్నియును
ఇల గరుత్మంతున కీడౌనె యెందు
భువి చిట్టికరణాలు భూపులమంచు
రచ్చకెక్కిన ధర్మరాజు లౌదురటె?"

అని తృణీకారముతో మాట్లాడినది. పాండవుల ఐశ్వర్యమునుగాంచి సహించలేక– సుహృద్ద్యూతమను నెపముమీఁద ధర్మజునోడించి, పాంచాలిని తన దాసిగా చేసుకొన నెంచిన దుర్యోధనున కీమాటలు చెవికెక్కునా? గెలుపొందిన గర్వముతో రారాజు దుశ్శాసనునకు చేసైగ చేయఁగా, మితిమీఱిన ఉత్సాహముతో నాతఁడు కృష్ణ వలువను బట్టి యీడ్వసాగినాఁడు. ఆ ఘోరమును చూడలేక సభాసదులందఱు తలలువాల్చి మౌనముద్రలో మునిఁగిపోయినారు. సనాథయయ్యును కృష్ణ అనాథవలె దీనజనావనుఁడైన శ్రీకృష్ణుని శరణు జొచ్చినది.

పాండవులందఱిలోను ఉద్రేకించిన మానసమును పట్టఁజాలనివాఁడు భీమసేనుఁడు. యుధిష్ఠిరుఁడు రాజ్యమును ధన కనకవస్తువాహనములును, కడకు తమ్ములను పణముగాఁబెట్టి ఓడిపోవు నంతవఱకును ఆతఁడు అతికష్టముతో మనస్సు నణఁచుకొని సహింపఁగలిగినాఁడు. తరువాత పాంచాలి పణ

ముగాఁబెట్టి నప్పుడే రోషమును శౌర్యమును విజృంభించఁగా అతఁడు ఆసనమునుండి లేవ బ్రయత్నించినాఁడు. చూచుచుండఁగనే దుర్యోధనుఁడు తమ్మునిఁబంపి పాంచాలిని సభకు పిలువ నంపుటయు—దుశ్శాసనుఁ డామెను కొప్పుబట్టి సభలోని కీడ్చి తెచ్చుటయు-గర్వోన్మత్తుఁడైన దుర్యోధనుఁడు కృష్ణ కట్టిన పుట్టముల నపహరింపుమని తమ్మునితో ననుటయుఁ జూచి భీమసేనుఁడిఁక తాళలేకపోయినాఁడు. అర్ధాంగి నాస్థితిలో గాంచిన భీముఁడు తన సోదరులను తిలకించి, వారి కెవరికిని ధైర్యము లేదని గ్రహించి, అనుజులు వారించినను ఆగక, రోషావేశమున లేచి నిలువఁబడినాఁడు. "కురువృద్ధులు, గురువులు, బంధువులు ఇందఱు పరివేష్టించియున్న యీ సభలో—నలుగురు చూడఁగా ద్రౌపది నిట్లవమానించిన తులువను వధించి రక్తపానము చేయకపోయినచో నా పెద్దల కపచారము చేసినవాఁడ నగుదు" నని ఉచ్చైస్స్వరముతోఁ బలికినాఁడు. సభాసదులందఱు దుర్యోధనుని మూఁడగములకు, ధృతరాష్ట్రుని బుద్ధిహీనతకును లోలోపల నిందించుచు కలవరము చేయ సాగినారు.

ఇటు పాంచాలి వలువల నపహరింపఁ దలపెట్టిన దుశ్శాసనునకు దేహము చెమర్చి—చేతులు లాగుకొని పోనారంభించినవి. అతఁడు లాగినకొలఁది పాంచాలి చేలాంచల మతి దీర్ఘమై కుప్పలు కుప్పలుగ పెరిగిపోయినదిగాని ఆమె దేహముపైనుండి వస్త్రము వైదొలఁగలేదు!

చూపరుల నీదృశ్య మాశ్చర్యాంబుధిలో ముంచివేసినది. రారాజు నోరు తెఱచుకొని నిశ్చేష్టుఁడై చూచినాఁడు.

తన్నవమానపఱచిన దుర్జయపరుల నాశనము చూడనిది తానుకురులను ముడువనని ఘోరప్రతిజ్ఞ చేయుచు పాంచాలి రారాజునుజూచి 'ధర్మజులతో ఆడిగెలచుటకాదు-నాతో ఆడి రాజ్యమును గెలువు'మని ధీరత్వముతోఁ బలికినది. అత్యాశా పరుఁడైన రారాజు పాంచాలితో జూదమాడ నుద్యుక్తుఁడై తగు నేర్పాట్లుచేసి ఆమె చేతిలో పాచికలు పెట్టినాఁడు.

ఆమె తృణీకారభావముతో పాచికలను కాలదన్నుచు మొదటి పందెమునకు ఏవురు పతులను, రెండవ పందెమునకు రాజ్యమును—తరువాతి పందెములకు పాండవు లోడిపోయిన ధనకనకవస్తువాహనములను క్రమముగా గెలుచుకొన్నది.

అంతలో శకునివచ్చి "ఇంత బ్రతుకుబ్రతికి ఆఁడువారి తోనా నీవు జూదమాడునది? అయినను ఆఁడువారి సంగతి నీకు తెలియనట్లున్నది.

ఆడవారికి కావె అగ్నియే తోడు !
ఉడికేటి యన్నము తొడికి జూచేరు
కాలేటి కొరవుల కాళ్ళతన్నేరు

అందునను పరమపతివ్రతయైన పాంచాలితో ఆడిగెలువ వలెననుకొనుట నీ వెఱ్ఱితనము కాదా? నీవుగెలిచిన వన్నియు తిరిగి పోయినట్లేకదా!" అని నిరుత్సాహ పఱచెను. రారాజు ఆటచాలించి లేచునంతలో అంతఃపుర మేఁగిన ధృతరాష్ట్రుఁ డేతెంచి దుర్యోధనుని మందలించి కోడలిని బిలచి "అమ్మా! నీవు కోరిన వరముల నిచ్చెదను కోరుకొను"మని పలికెను.

పాంచాలి సంతసించి తన పతులను దాస్య విముక్తులుగా చేయుమని కోరినది. ధృతరాష్ట్రుఁడందుల కంగీకరించి

రెండవ వరము కోరుకొనుమని పలికినాఁడు. పాండవులకు వారి యాయుధములను ప్రసాదించుమని కృష్ణ కోరినది. ధృతరాష్ట్రుఁడందులకు ఆమోదించి మరొక వరమును కోరుకొనుమని కోడలిని ప్రోత్సహించినాఁడు.

ద్రుపదనందని ధర్మాధర్మముల నెఱిఁగిన ప్రౌఢ. ఆపత్సమయములలోకూడ ధర్మము నెదిరించునది కాదు. వృద్ధరాజు తనపక్షమై కోరిన వరముల నిచ్చుటకు సంసిద్ధముగా నుండెనని తనకధికారములేని వాటిని వెంగలివలె కోరునా? వెంటనే ధృతరాష్ట్రునకు మ్రొక్కి "వైశ్యసతికి ఒక వరమును, క్షత్రియ సతికి రెండు వరములును, శూద్రసతికి మూడును, విప్రసతికి నూరు వరములును అడుగు నధికారము కలదు. నాకు రెండు వరములను మాత్రమే కోరునధికారము కలదు. కనుక నేనుకోరిన రెండువరములను ప్రసాదింపు"మనిపలికినది.

వృద్ధరాజు సంతోషించి పాండవులను బిలచి' సద్ధర్మరాలైన ద్రౌపదితో రాజ్యము నేలుకొనుఁడని దీవించి పంపినాఁడు.

# 5. ఊర్మిళాదేవి నిద్ర

శ్రీ రామ భూపాలుడూ-పట్టాభిషిక్తుడై-కొలువుండగా
భరతశత్రుఘ్నులపుడూ-సౌమిత్రిపరుస-సేవలు సేయగా
మారుతాత్మజులప్పుడూ-రాఘవుల-చేరి పాదములొత్తగా
సుగ్రీవుడా కొలువులో-నమ్రుడై శోభిల్లి-కొలువుండగా
తుంబురుడు నారదుడునూ-ఏతెంచి-తోడగానము సేయగా
సనకాది మౌనీంద్రులూ-కొలువులో-శాస్త్రములు తర్కించగా
పొంగిదేవతలు కొలువూ-ఉదయాన-పుష్పవర్షముగురిసెనూ

ఆదివ్యముహూర్తమున జానకి సభనంతయు నొకసారి కలయఁజూచి తెప్పపాటుకాలము తనదృష్టిని లక్ష్మణ దేవర ముఖముమీఁదికి సారించినది. సోదరుని యెడల అత్యంతశ్రద్ధయు, అమితమైన గౌరవమునుగల లక్ష్మణస్వామి, భక్తిపారవశ్యములో, తనఅన్నగారు అష్టకష్టములు పడి-లోకకంటకుల నణచి-సకల దేవతలును మెచ్చగా-తిరిగి అయోధ్యాపురము ప్రవేశించి నారను సంతోషములో మునిఁగి ఉన్నాడు. అంత సంతోషములోను-ఆయన ముఖము మీఁద విచార రేఖలు సీతమ్మకు పొడచూపినవి. ఆ విచారము భార్యావియోగ వేదనాపరితప్తత కాదుగద! పదినెలలపాటు తామిరువురు ఒకరి ఎడబాటునొకరు సహించుకొనలేక-కుగ్రింగి, కృశించి భాస్కరదర్శనములేని పద్మమువలె వాడిపోయిన విధము ఆమెకు జ్ఞప్తికి వచ్చినది. తాను అశోకవనములో- రాక్షసీజనపీడితయై-శ్రీరామదర్శన లాలసయై-రామనామము జపించుచు-

దినమొకయుగముగా గడపిన విధము స్మృతికి వచ్చి, ఆమె యొడలు జలదరించినది, పూర్ణచంద్రునివంటి మొగము వాడి, ముకుళించుకొని పోయినది. శ్రీరామపార్శ్వవర్తిని యయినను భర్తృవియోగ వేదనాభరమును తలంచుకొని క్షణకాలము కన్నులు మూసికొన్నది. దుఃఖజలధిలోని అగాధములను గాంచినది సీతమ్మ. కనుకనే పదునాలుగేండ్లుగా భార్యను విడచి, తమ యిద్దఱను ఛాయవలె అనుసరించుచు–కంటికి రెప్పవలె కాచిరక్షించి, కష్టసమయములో అన్నగారికి తోడు నీడయై–తమ్మను అయోధ్యాపురికి తోడ్తెచ్చిన లక్ష్మణదేవర హృదయము గాఢమైన వేదనలతో అలముకొని పోవుట ఆతల్లి చూడలేక పోయినది. ఆమె హృదయము కరిగి పోయినది.

సభాసదు లందఱు మనోరంజకములయిన వివిధగోష్ఠు లలో మునిఁగి పోయినారు.

తమ్ముని విషయము అంతవరకును శ్రీరామచంద్రునికి జ్ఞప్తికి రాకపోవుట సీతమ్మ భరించలేకపోయినది. లక్ష్మణ స్వామిని ఊర్మిళ చెంతకు పంపవలసినదని శ్రీరాముని వేడు కొన్నది. ఆయన తన పొరపాటునకు చింతించి,అమితవాత్సల్య ముతో తమ్ముని దీవించి ఊర్మిళాంతఃపురమునకు పంపినాఁడు.

అంతఃపురప్రవేశము కావించిన లక్ష్మణుఁడు, ఊర్మిళా దేవితల్పమున కెదురుగా నిలువబడి పోయినాఁడు.

పదునాలుగు సంవత్సరములనుండి తన ఆదేశము నను సరించి–షడూర్ములను నిగ్రహించి జడపదార్థమువలెసుషుప్త్య

వస్థలో ఊర్మిళ మునిఁగిపోయినది. ఇతరప్రపంచమెఱుఁగదు-తన వియోగముకూడ ఎఱుఁగదా? తపస్సమాధిలో మునిఁగి పోయిన మౌనివలె నున్నది. ఇప్పుడు తనతపము సిద్ధించినదని ఎఱుఁగదేమి? అమాయకురాలు! ఇఁక ఆతఁడు ఒకత్రుటి కాలమైనను సహించలేఁడు.

మృదువుగా ఆమెకు జాగ్రదవస్థను కలిగించఁ దలఁచి, ఆమె సుందరితనువల్లికపై పచ్ఛడమును సడలించినాఁడు.

ఊర్మిళ తపోభంగమైన మునివలె-పీడితనాగినివలె అదరి పడి లేచినది. కాని నిద్రమత్తు పూర్తిగా విడకపోవుటచే తన యెదుట సాక్షాత్కరించినదెవరో తెలిసికొనలేక పోయినది.

అయ్యో మీరెవ్వరయ్యా-మీరింత-యాగడమ్మునకొస్తిరీ
దారిగొందులు వెదకుచూ-మీరింత-తప్పుసేయగ వస్తిరీ
ఎవ్వరూలేనివేళా-మీరిపుడు-ఏకాంతమున వస్తిరీ
మా తండ్రి జనకరాజూ-వింటేను-మర్యాద మరి దక్కదూ
మా యక్కబావ విన్నా-మీకప్పుడు-ప్రాణముల హానివచ్చూ
మాయక్క మరది విన్నా-మిమ్మిపుడు-మనగనీయరుజగతిలో
హెచ్చైన వంశానికీ-అపకీర్తి - వచ్చె నేనేమిసేతూ
కీర్తిగల యింటబుట్టీ-అపకీర్తి-కీడయ్యె నేమిసేతూ

అతఁడెవరో అన్యుఁడు - అక్రమముగా అంతఃపుర ప్రవేశముచేసి దుర్మార్గమున కొడిగట్టినాఁడని ఆమె తలఁచి నది. తమవారి పేరుప్రతిష్ఠలు వంశగౌరవమును తెలిపి అతనిని మందలించినది. తనస్థితికి విచారపడినది.

సీతారాముల ననుసరించి అరణ్యములో నివసించినది మొదలు లక్ష్మణుడు ఇతర ప్రపంచమును విస్మరించినాడు. అతని దృష్టికి కనుపించినది ఇద్దఱే-అన్నగారు, వదినెగారును. అతడు చేయఁబూనినది వారిసేవ ఒక్కటే. నిద్రను సహితము అరికట్టి వారిపాదములనే కొలచినాడు. ఈ తీరుగా దీక్షతో పదునాలుగు సంవత్సరములు గడపినాడు. నేఁటికి పూజ్యురాలైన వదినెగారి పుణ్యమున ఊర్మిళ చెంతకు వచ్చు భాగ్యము కలిగినది. ఆత్మేశ్వరిని చూడఁగనే లక్ష్మణుని బుద్ధికి వికాసము, దేహమునకు ప్రకాశమును కలిగినవి. సుషుప్తిలో నున్న కాంతకు సంభ్రమముతో తనను ఎఱుక పఱచు కొన్నాఁడు.

లక్ష్మ:— శ్రీరాము తమ్ముండనే-
ఊర్మి:— అతడనగ-సృష్టిలో నొకరు గలరా?
లక్ష్మ:— జనకు నల్లుడ గాననే-
ఊర్మి:— భూమిలో-జనకులనగా నెవ్వరు?
లక్ష్మ:— పుడమినుండీ బుట్టినా-సీతకూ-ముద్దు మర
దిని గాననే!

ఊర్మి:— సీతయనగా నెవ్వరూ-భూమిలో-సృష్టియనగా
నెరుగనా?

లక్ష్మ:— నెలత యూర్మిళవందురే-నీపేరు-నిక్కమూఁదాచెదేల?
శ్రీరాము నెడబాసియూ-అక్కడా-సీతమ్మ చెరబోయెనూ
కేలిమ్ము ఇందువదనా-లోకాప-కీర్తికే లోనౌదునూ
సీత మరదిని గాననే చేడెరో-చేరిదయనేలుకోవే

ఇంతదూరము లక్ష్మణస్వామి ఇన్నివిధములుగా వేడు కొన్నప్పటికినీ ఊర్మిళాదేవి హృదయము అనుమానరహితము కాలేదు. రఘువంశసోదరుల పరాక్రమము సడలునదికాదే అని ఒకింతసేపు శంకించి, తిరిగి ప్రశ్నించినది.

సింహవిక్రములు మీరూ - ఉండగా - సీతెట్లు చెరబోయెనూ?
రాజ్యాధిపతులు మీరూ - ఉండగా-రమయెట్లుచెరబోయెనూ?
రామలక్ష్మణులు మీరూ - ఉండగా-రమణెట్లు చెరబోయెనూ?

అని తమవారిని గుణించి తన గొప్ప హృదయమును బయటఁబెట్టినది. 'దశరథుని కొడుకులు, కోడండ్రు అనగా సామాన్యులను కొన్నావుటయ్యా?' అని ధీరవచనము లాడినది.

కాలవిధి గడుప వశమా-ఎవరికిని-కనగ నాబ్రహ్మకైనా
పడతి అయోధ్యవెడలీ-మేమొక్క-పర్ణశాలలో నుంటిమీ
స్వర్ణమయ మాయమృగమూ-ఆపర్ణ-శాల వాకిట జొచ్చెనూ
స్వర్ణమృగమును తెమ్మనీ-మీయక్క-స్వామి కాళ్ళకు మ్రొక్కెనూ
విల్లంబు చేతబట్టీ-శ్రీరామ-వీరుడూ వేటకరిగె
విల్లంబు తగులగానే-మృగమొక్క-వింతైన కూతగూసె
'హాసీత హాలక్ష్మణా'-యని కూయ-అతివ భీతిలి పలికెనూ
నన్ను బొమ్మని పలికెనూ-ఎరుగవూ-నాతల్లి వద్దంటినీ
కర్ణ శూలంబులయినా-ఎన్నయిన-కఠిన సూక్తుల నాడెనూ
గెఱగీసి యానబెట్టీ-నేబోతి-తెఱవ మాయన్న కడకూ
పోయినంతా వేగమూ-రావణుడు-మాయవేషము వేసుకా
నారాయణ యని వచ్చి-ఎదురుగా-నలినాక్షికడ నిల్చెనూ
హరిభక్తుడనుచుతోచీ-అమగువ-అతివేగ భిక్షపెట్టే

పదితలలు చూపగానే-అచేడె-పడిమూర్ఛలో మునిగెనూ
గద్దతో పెల్లగించీ-ఎత్తుకొని-కడకు లంకకు బోయెనూ
పసిడి మృగమును బట్టుకూ-శ్రీరామ-భద్రులూ ఏతెంచిరీ
చాల వనమెల్ల వెతకీ-అపర్ణ-శాలెల్ల వెతకి యలసీ
కిష్కింధ పర్వతానా-వెదుకగా-కేల్మోడ్చి సుగ్రీవుడూ
కౌసల్య తనయులనుచూ-అతండు-కానుకలు తెచ్చిచ్చెనూ

దుఃఖాశ్రువులతో కన్నులు నిండఁగా 'ఆనగలు జానకీ దేవివేమో చూడు'మని శ్రీరాముఁడు తమ్మున కాదేశించి నాఁడు. ఆ దేవి ముఖసందర్శన మెప్పుడును లక్ష్మణు డెఱుఁగఁడు. ఆమె నగకట్టును చూచియే ఎఱుఁగఁడు. నిత్యము ఉదయపువేళ పాదాభివందనము చేయుటవలన దేవి పాద భూషణమైన అందెను మాత్రము గుర్తించఁగలిగినాఁడఁట! సింహవిక్రముఁడైన సుగ్రీవుని చెలిమిచేసి వాలిని వధించి హనుమంతుని లంకకుఁ బంపిన విధము, సీతాన్వేషణకై కపివరుఁడు బయలుదేఱి కార్యము సాధించుకొని వచ్చిన విధము, పెక్కువేల సైన్యముతో రామచంద్రులు బయలుదేఱి, వారధినిబంధించి సేతువునుకట్టి లంకనుజయించి సీతమ్మను తెచ్చిన వైనము వివరముగా లక్ష్మణస్వామి ఊర్మిళకు తెలిపినాఁడు.

పదినెలల కాలము పరస్థలములో ఉండి వచ్చిన జానకీ దేవిని శ్రీరామచంద్రుఁడు పరిగ్రహించుటకు సమ్మతించలేదు. పెనిమిటి శంకించినందులకు వైదేహి దుఃఖించి "ఈశరీరముతో బ్రతుకఁజాలను కనుక చితిని సిద్ధము చేయవలసిన"దని లక్ష్మణునితో చెప్పినది. జానకి మాలిన్య రహితయని యెఱిఁగి

యుండియు, ఆమెయెడ శ్రీరామునికిఁగల వైముఖ్యము తనకు సమ్మతి గాకుండినను సోదరుని యాజ్ఞమీఁద చితి నేర్పఱచి నాఁడు. ఆకాశమునంటు అగ్నిజ్వాలలు నాలుకలను జాపుచు నలువైపులను విజృంభించినవి. అందఱును గడగడలాడినారు. కాని-మైథిలీ దేవి పరిశుద్ధురాలు కనుక-తన పవిత్రస్పర్శతో పావకుని పవిత్రమొనర్చి శీతలునిఁగా చేసివేసినది.

తన పారిశుద్ధ్యము, పాతివ్రత్యము దశదిశలు వ్యాపించఁగా-సకలలోకములు మెచ్చఁగా సీతమ్మ శ్రీరాముని దరిఁ జేరినది.

భరతుని ప్రార్థనల వలనను-పురవాసుల అభీష్టము వలనను శ్రీరామచంద్రుఁడు తిరిగి రాజ్యమును స్వీకరించినాఁడు. 'సీతారాములతో అన్నియిడుమలఁ బడివచ్చిన నన్ను ఆదరించవా?' అని లక్ష్మణుఁడు ఊర్మిళను వేడుకొనినాఁడు.

లక్ష్మణస్వామి సాక్షాత్కారము, వనవాసవిశేషములు ఊర్మిళకు పగటికలగా తోఁచినది. సీతమ్మ అగ్నిప్రవేశము మాటరాఁగానే నిద్రమత్తు సాంతముగా వీడిపోయినది. లక్ష్మణస్వామి రాక అప్పుడు సత్యముగానే తోఁచినది. సంభ్రమములో కలిగిన తత్తరపాటుతో-దిగ్గునలేచి- అలసి వచ్చిన స్వామికి పాదాభివందనము చేసినది.

సరిగా ఆ సమయమునకే, అంతఃపుర ప్రవేశము గావించిన లక్ష్మణస్వామిని పలుకరించి దీవించుటకు శాంతమ్మ ఒక ప్రక్కనుండియు - పదునాలుగు సంవత్సరముల అనంతరము

నూతన వధువయిన ఊర్మిళ సోయగమును తిలకించుచున్న సీతమ్మ మఱొక ప్రక్కనుండియు లక్ష్మణుని శయ్యాగారమున ప్రవేశించినారు.

వారి నవ్వులకు పాన్పుమీది బొండుమల్లెలు తోడు పలికినవి. వదినామఱదండ్ర మందహాస తరంగములు ఉద్యాన వనములోని సుగంధవాయువులతో కలసి నలుదెసలును వ్యాపించినవి! ఊర్మిళా లక్ష్మణులు వారి శుభాశీస్సుల నందు కొన్నారు.